చందా వివరములు
ఆంధ్రవారపు సచిత్ర వారపత్రిక
రూ. [నయాపైసలు]
సంవత్సర చందా ... 13 00
అర్ధ సంవత్సర చందా ... 6 50
విడి ప్రతి ... ,, 25
భారతి (సచిత్ర మాసపత్రిక)
సంవత్సర చందా ... 12 00
అర్ధ సంవత్సర చందా ... 6 00
విడి ప్రతి ... 1 00
ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక



319527

The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 116 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO శనివారం 27-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు

# ప్రభుత్వ సంస్థలలో తక్కువ జీతాలు ఇస్తున్నారని ముఖ్యమంత్రి కి వార్త

## ట్యునీషియాలో రాజరికానికి స్వస్తి

### బోర్గ్యూబా అధ్యక్షుడుగా గణతంత్ర రాజ్య స్థాపన

ట్యూనిస్, జూలై 25: 250 సంవత్సరాలనుంచి సాగుతున్న రాజరికాన్ని రద్దుచేసివెయ్యడానికి, దేశంలో గణతంత్రాత్మకమైన రాజ్యాన్ని స్థాపించడానికి ట్యునీషియా రాజ్యాంగ పరిషత్తు నేడు ఏకగ్రీవంగా ఆమోదించింది.

ఆ అనంతరం దేశాన్ని గణతంత్ర రాజ్యంగా ప్రకటించి, ప్రస్తుతం ప్రధానమంత్రిగా పని చేస్తున్న శ్రీ హాబీబ్ బోర్గ్యూబాను ప్రథమ అధ్యక్షుడుగా ఈ రాజ్యాంగ పరిషత్తు ఎన్నుకొంది.

[illegible]

### ఇందులో ప్రతీకారం లేదు

[illegible]

### లామనోబాకు బదిలీ

[illegible]

### సుల్తాను పాలనను గూర్చి ప్రతినిధుల విమర్శ

[illegible]

### శాంతియుతమైన విప్లవం

[illegible]

## మొరాకోలో, లిబియాలో కొంత అలజడి

అయితే ట్యునీషియాలో జరుగుతున్న ఈ మార్పులు రాజులుగాని, సుల్తానులుగాని సహించలేదు. [illegible]

ట్యునీషియాలో జరిగిన ఈ పనివల్ల, మొరాకో సుల్తానుకూడా గణతంత్రవాదులు బలపడతారని రాజకీయవాదులు భయపడుతున్నారు. ట్యునీషియా ప్రధానమంత్రి

(4 వ పుట చూడుడు)

### లిబియా రాయబారి

[illegible]

## జూలై అఖరుకు జమాబంది పూర్తి

### సహకరించని వారి తొలగింపు

హైదరాబాదు, జూలై 26: లోగడ నిర్ణయించిన గడువు జూలై అఖరుకు జమాబందిని పూర్తిచేసే పనిలో సహకరించని గ్రామాధికారులను ఉద్యోగాల నుంచి బర్తరఫ్ చేసి క్రొత్తగా వారికి బదులు ఆ ఉద్యోగాలలో నియమించే వారి సహకారంతో జమాబంది పని పూర్తి చేయిస్తామని శాసనసభలో రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు హెచ్చరిక చేశారు. (ఈ వార్త వివరంగా నిన్న నే ప్రకటించాము.)

## ఎగువ సభల సభ్యుల సంఖ్య

[illegible]

## తెలంగాణాలో విస్తారమైన వర్షం

[illegible] ... కర్నూలు, మహబూబ్ నగరాలలో సరి 4, కడప, రెంటచింతల, నిజామాబాద్‌లో సరి 3 సెంటిమీటర్ల వర్షం పడింది. 27 వ తేదీలోగా తెలంగాణా, ఆంధ్రప్రదేశ్ కోస్తాలలోను ఇతర స్థలాల్లోను కొంత విస్తారంగా వర్షించగల సూచన ఉన్నది.

## రు 100 కోట్ల మేరకు ఋణాల సేకరణ

### భారత ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, జూలై 25: భారతప్రభుత్వం రు 100 కోట్లను సంపాదించే ఉద్దేశ్యంతో రెండు ఋణాల సేకరణకు పూనుకున్నది. ఈ విషయమై నేడు చేసిన ప్రకటనలో ఇలా వివరిస్తున్నారు:

మొదటిది జాతీయ ప్రణాళిక పత్రాలు. ప్రభుత్వం యిదివరలో యీ విధమైన పత్రాలకు మూడుసార్లు జారీ చేసింది. ఇది చాలబాగున్నది. వీటిమీద [illegible]

బొంబాయి, కలకత్తా, మద్రాసు, నాగపూర్, న్యూఢిల్లీ, వద్ద గల రిజర్వు బ్యాంకు కార్యాలయాలు, [illegible]

### భారీ పరిశ్రమల అభివృద్ధి

### రూ 55 కోట్ల రప్పా ఋణం

[illegible]

## ఇక అన్యాయాన్ని సరిదిద్దుతారని హామీ

### పరిశ్రమలకు ప్రత్యేకంగా సలహా సంఘాన్ని వేసే సంకల్పం

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాదు, జూలై 26: "ప్రభుత్వ యాజమాన్యంలో భాగా నడుస్తున్న సంస్థలలో కూడా కార్మికులకు సరయిన జీతభత్యాలు దొరకడంలేదని నాకు వార్తలు వచ్చినవి. ఇది చాలా అన్యాయం. ప్రభుత్వం తగిన శ్రద్ధతీసుకుంటుంది. ఒకరిద్దరు శాసనసభ్యులకూ, ఒకరిద్దరు వ్యాపారస్థులకూ ప్రాతినిధ్యం ఇచ్చి పరిశ్రమలకు ప్రత్యేకంగా సలహా సంఘాన్ని ఏర్పాటుచెయ్యాలనుకొంటున్నాము" అని ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవాళ శాసనసభలో అన్నారు.

పరిశ్రమలశాఖ పద్దుకు రు 168.49 లక్షలూ, రోడ్డు రవాణా "డిపో" పద్దుకు [illegible]

[illegible]

### దాపరికం లేదు

[illegible]

### గిట్టుబాటుగా లేదు

రోడ్డు రవాణాశాఖ సంగతిని ప్రస్తావించి ముఖ్యమంత్రి ఇట్లా చెప్పారు: "మద్రాసువంటి నగరాలతో పోల్చితే తెలంగాణా కలిపి మన రోడ్డు రవాణా శాఖకు వచ్చేలాభం చాలా తక్కువ. ఉద్యోగులకు ఇచ్చే జీతాలే దీనికి కారణం అని చెబుతున్నారు. కానీ, ఈసమాధానం నాకు తృప్తికరంగా లేదు. అనుభవం గలవారి నెవరినైనా తీసుకువచ్చిగానీ, ఆ శాఖలోని వారిద్వారా గానీ ఈ వ్యవహారాన్ని దర్యాప్తు చేయించాలని అనుకొంటున్నాను. రోడ్డు రవాణా శాఖను ఆంధ్రప్రాంతానికి విస్తృతం చెయ్యడానికి దాదాపు రు 2 కోట్లు అవసరం. అంత అదనపు ఖర్చును భరించే స్థితిలో ప్రభుత్వం ఇప్పుడు లేదు."

### ప్రభుత్వ పెట్టుబడులున్న పరిశ్రమలు

"ఆల్విన్ మెటల్ వర్క్సు వంటి సంస్థలలో ప్రభుత్వానికి గల వాటాలను తక్కువ మొత్తాలకు అమ్మివెయ్యడమా లేక ఇంకా కొంత సొమ్ము వాటికి కేటాయించి వాటిని బాగుచెయ్యడమా అనే సమస్యపై ప్రభుత్వం ఇంకా నిర్ణ[illegible]

[illegible] అప్పుగా రు. 18 లక్షలూ ఈ పరిశ్రమలకు కేంద్రప్రభుత్వం ఇస్తోంది. ఇది చాలా తక్కువ. ఇంకా డబ్బు కావాలి. రేడియోల విడిభాగాలూ, సైకిళ్ల విడిభాగాలూ, చిన్న చిన్న మోటార్ల సందర్భంలో కొన్ని పథకాలను తయారుచేసి కేంద్రప్రభుత్వానికి పంపించాము. వారివద్దనుంచి ఎంత త్వరగా ఉత్తరువులువస్తే అంతత్వరగా పని ప్రారంభించడానికి వీలవుతుంది. కుటీర పరిశ్రమల సందర్భంలో కూడా కొన్ని పథకాలను కేంద్ర ప్రభుత్వం పరిశీలనకు పంపించాము."

"ఆంధ్ర ప్రాంతంలో రెండే రెండు ముఖ్యమైన పరిశ్రమలున్నవి. అవి సిమెంటు, చక్కెర. ముఖ్యమైన రెండు సిమెంటు ఫ్యాక్టరీలు మంగళగిరిలోనూ, విజయవాడలోనూ ఉన్నవి. మాచర్లలోనూ, నడిపూడి, విజయనగరం, కమలాపురం వంటి కొన్ని ప్రాంతాలలోనూ సిమెంట్ ఫ్యాక్టరీలను నెలకొల్పడానికి కొందరు వ్యాపారస్థులకు అనుమతులను ఇచ్చాము." అయితే వాటిలో ఇంకా ఉత్పత్తి ప్రారంభం కాలేదు. దేశంలో తయారయ్యే సిమెంట్ అంతా కేంద్ర ప్రభుత్వం ఒక చోట చేర్చి ఏ రాష్ట్రం ఎంత వినియోగించుకోవాలో నిర్ణయిస్తుంది. అందువల్ల మన రాష్ట్రంలో ఉత్పత్తి [illegible]

### కుటీర పరిశ్రమలు

[illegible]

### బోదన్ చక్కెర ఫ్యాక్టరీ

[illegible]

(4 వ పుట చూడుడు)

## పటాస్కర్ నివేదిక కేంద్రానికి అందలేదు

న్యూఢిల్లీ, జూలై 26: ఆంధ్ర, మద్రాసు సరిహద్దు వివాదంపై దర్యాప్తు జరిపిన శ్రీ హెచ్. వి. పటాస్కర్ నివేదిక ప్రభుత్వానికింకా అందలేదని లోక్‌సభలో ఒక ప్రశ్నకు హోంశాఖామంత్రి శ్రీ పంత్ వ్రాతపూర్వకంగా ఇచ్చిన సమాధానంలో పేర్కొన్నారు.

## జపాన్ వరదల్లో వేనకువేలు మృతి

టోక్యో, జూలై 26: జపాన్‌లోని పశ్చిమ క్యూషూ ప్రాంతంలో వేలాది ప్రజలు వరదల పాలై నారు. ఆ ప్రాంతంలో ఉండపోతగా వర్షాలు పడటంవల్ల చాలా గ్రామాలు పూర్తిగా ధ్వంసంఅయినాయి.

ఎలాగైనా అక్కడికి వెళ్లేందుకు పోలీసులు, సైనికులు విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

ఇసహాయా, షిమబారా పట్నాల్లో [illegible]

## బొంబాయి టెలివిజన్ కేంద్రనిర్మాణం వాయిదా

[illegible]

### ముఖ్యమంత్రి కార్యక్రమం

హైదరాబాదు, జూలై 26: ముఖ్యమంత్రి [illegible] 28 న ఇక్కడినుంచి మద్రాసు వెళ్ళి మర్నాడు ఇక్కడికి తిరిగివస్తారు.

సిమ్లా, జూలై 25: కొద్దిరోజులనుంచి ఎడతెరిపి లేకుండా కురుస్తున్న వర్షాల కారణంగా, యీ ఉదయం కొంఢ్ ఘాట్ స్టేషన్లమధ్య ఒక ఇంజను, నాలుగు గూడ్సు పెట్టెలు తలక్రిందులైనాయి.

ప్రాణహాని మాత్రం జరుగలేదని తెలుస్తున్నది.

## బోదన్‌లో న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీ స్థాపన

### ప్రభుత్వ వాటా కోటిరూపాయలు: సంజీవరెడ్డి ప్రకటన

హైదరాబాదు, జూలై 26: ఇక్కడకు 120 మైళ్ళ దూరంలో ఉన్న బోదన్‌లో న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీని స్థాపించాలని భారతప్రభుత్వం తుదినిర్ణయం చేసిందనీ, ఈ ఫ్యాక్టరీలో కోటిరూపాయల వాటాలు రాష్ట్రప్రభుత్వం కొంటుందనీ శాసనసభలో పరిశ్రమలకు సహాయం చేసేందుకు 668 లక్షల రూపాయల పద్దును ప్రతిపాదిస్తూ, ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి తెలిపారు.

[illegible]

### పంచదార ఫ్యాక్టరీవల్ల ఏటా 50 లక్షల లాభం

[illegible]

## పాకిస్తాన్ దాడిచేస్తే - భారతసైన్యం సిద్ధం

### లోక్‌సభలో మీనన్ హెచ్చరిక

న్యూఢిల్లీ, జూలై 26: పాకిస్తాన్‌తో యుద్ధానికి సైన్యాన్ని నిత్యం సన్నద్ధంగా దాపులో ఉంచాలని భారత దేశం మతంకాదు; ఆ దేశంతో స్నేహం అలవరుచుకోడానికి ప్రయత్నిస్తుంది; కాని ఈ ప్రయత్నాలు విఫలమై, 1947లో మాదిరిగానే భారతదేశంపై మళ్ళీ దాడిజరిగితే, దాడిచేసిన వారిని ఇచ్చినంతమించి ఇచ్చివంపగలరని, భారతదేశ రక్షణ మంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్ ఇవాళ లోక్‌సభలో హెచ్చరిక చేశారు.

దేశరక్షణ పద్దు క్రింద రు 172 కోట్ల [illegible] ఇవాళ చర్చ [illegible]

[illegible]

భారత సైన్యాలు ఆయుధాల విషయంలో అన్ని అంశాలలో ఇతర దేశాలపై ఆధారపడే అవసరం లేకుండా చూడాలని శ్రీ వి. క. గోడియల్ (కమ్యూనిస్టు - కేరళ) అన్నారు.

[illegible] సమాచారం భారతపార్లమెంటుకు అందినంతగా మరేదేశంలో ఏ పార్లమెంటుకూ అందడం లేదని చెప్పారు. ఏ సభ్యులు ఏ సమాచారం కోరినా, నియమాలకు విరుద్ధం కానంత మేరకు, అంచనాల సంఘం, ఆయవ్యయాల పరిశీలక సంఘం స్థాయీ సంఘాలలో తెలుపగలరని వాగ్దానమిచ్చారు.

దేశరక్షణ వ్యయంలో విదేశీద్రవ్యం వెచ్చించవలసినది పెద్దమొత్తం కాదు. ఈ యేడాది అది 9 కోట్లు మాత్రమే వుంటుంది.

కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వాల ఆదాయాల మొత్తంలో 10% మాత్రమే దేశరక్షణకు వ్యయపరుస్తున్నారని శ్రీ మీనన్ చెప్పారు. ఈ యేడాది రూ 50 కోట్లు ఎక్కువ అడగడానికి కారణం, పరికరాలు కొత్తవి సరఫరా చెయ్యడానికీ, కొంత సాధారణ సైనిక శిక్షణకేంద్రాల అభివృద్ధికీ మాత్రమే, అన్నారు.

సైనికోద్యోగులను కొద్ది ప్రాంతాల నుంచి మాత్రమే తీసుకుంటున్నారనే ఆరోపణకు జవాబిస్తూ, మనదేశంలో సంప్రదాయసిద్ధంగా యుద్ధజాతులున్నాయనే సంగతి మరిచిపోరాదని శ్రీ మీనన్ చెప్పారు.

ఆయుధ కర్మాగారాలలో పనినుంచి తొలగించిన సిబ్బందిలో 3600 మందికి ఇతరత్రా పనిచూపించారు. 900 మంది ఏపనీ అక్కరలేదన్నారు.

### గాంధేయ సైన్యమని ఖ్యాతి సంపాదించారు

[illegible]

(4 వ పుట చూడుడు)

ప్రశ్నోత్తరాలు:

# వ్యయకర్తనకు సంఘం నియామకం

## శాసనసభలో ముఖ్యమంత్రి ప్రకటన

హైదరాబాదు, జూలై 25: ఖర్చు తగ్గింపు మార్గాలను సూచించటానికి గాను ప్రభుత్వం స్థానికపాలన మంత్రి అధ్యక్షత క్రింద అధికార, అనధికార సభ్యులతో ఒక సంఘాన్ని నియమించ దలచిందని ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవ్వాళ శాసనసభలో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యకు చెప్పారు. సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షత వహించారు.

ఆయన వేసిన మరో ప్రశ్నకు సమాధానం ఇస్తూ ఉద్యోగుల త్రైమాసిక జాబితాను శాసనసభా సభ్యులకు ఇచ్చే ఏర్పాటుచేస్తామని ముఖ్యమంత్రి చెప్పారు.

### కాకినాడ రేవు అభివృద్ధి

శ్రీ మండపాటి నాగిరెడ్డి ప్రశ్నకు సమాధానంగా మొదటి ప్రణాళికలో రు 8 లక్షల 25 వేలు, ద్వితీయ ప్రణాళికలో రు 14 లక్షల 15 వేలు కాకినాడ రేవు అభివృద్ధికి కేటాయించారని రవాణా మంత్రి శ్రీ మండుముల నరసింగరావు చెప్పారు.

మచిలీపట్నం రేవుఅభివృద్ధికి మొదటి ప్రణాళికలో 1 లక్షా 50 వేలు, రెండవ ప్రణాళికలో రు 8 లక్షల 95 వేలు కేటాయించారనీ, విశాఖపట్నం, కాకినాడ రేవులను ఇంకా అభివృద్ధి చేయటం గూర్చి కేంద్రానికి తెలియజేయ వచ్చునికూడా శ్రీ నరసింగరావు తెలియజేశారు.

రివిన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావు శ్రీ పోతుల గున్నయ్య ప్రశ్నకు సమాధానం ఇస్తూ బొబ్బిలి తాలూకా, రంగరాయపురం గ్రామంలోని 75 యకరాల భూమిని ఈ సంవత్సరాని కైనా సరే స్వల్పకాలానికి గాని, దీర్ఘకాలానికిగాని కవులుకు ఇచ్చే ఉద్దేశ్యం లేదనీ, ఈ భూమి చెరువు గర్భమనీ, కలెక్టరు, న్యాయస్థానాలు ఇది రైతుల భూమి కాదని చెప్పారనీ తెలియజేశారు.

### నిమ్మకాయల ఎగుమతి

జనతాలో ఢిల్లీకి నిమ్మకాయలను ఎగుమతి చేయటానికి సౌకర్యం కలిగించే విషయమై ప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి వ్రాస్తుందని శ్రీ యం. నరసింగరావు, శ్రీ పులుంబాక శ్రీ రాములుకు చెప్పారు. శ్రీ నాగిరెడ్డి ప్రశ్నకు సమాధానమిస్తూ గుంటూరు, తెనాలి ప్రాంతంనుండి కలకత్తాకు నిమ్మపళ్లను రవాణాచేయటానికి వీలుగా గత మార్చి 16 తేదీనుండి హౌరా - విజయవాడల మధ్య జనతాకు అదనపు సరకులపెట్టెను తగిలిస్తున్నారని మంత్రి తెలియజేశారు.

### బకాయిలజాబితా సాధ్యంకాలేదు

తెలంగాణాలో అయిదువేలపైగా తక్కావీ బకాయిలు కట్టవలసినవారి జాబితా లభ్యం కాలేదని రివిన్యూ మంత్రి అన్నారు.

శ్రీ ఎస్. వి. కె. ప్రసాద్ ప్రశ్నకు సమాధానం ఇస్తూ ఆంధ్రలో అప్పు వాయిదాలను చెల్లించవలసిన గడువును రివిన్యూ శిస్తుతో పాటు చెల్లించే ఏర్పాటు జరిగిందనీ, తెలంగాణాలో తక్కావీ వాయిదాలను ప్రతిసంవత్సరం జూన్‌లోగా కట్టవలసి వుంటుందని రివిన్యూమంత్రి చెప్పారు.

ఉప ప్రశ్నలకు సమాధానం ఇస్తూ తెలంగాణాలో జూన్, జూలైలో వాయిదా చెల్లించవలసి వుంటుందనీ, అప్పుడు పంటవుండదు కాబట్టి సగం ఇప్పుడు చెల్లిస్తే సగం పంటకాలంలో చెల్లించవచ్చుని అన్నారు. చిన్న రైతుల విషయం ఆలోచించటం సాధ్యపడదు అని మంత్రి మరో ప్రశ్నకు చెప్పారు.

### పాండువగండి రిజర్వాయర్

శ్రీ జి. యల్లమందారెడ్డి ప్రశ్నకు సమాధానంగా కనిగిరి తాలూకా, పాండువగండి రిజర్వాయర్ కు మడిపైపు కాల్వనిర్మించే ఆలోచనలేదని నీటిపారుదల, విద్యుచ్ఛక్తి మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు చెప్పారు. రెండేళ్లు రిజర్వాయర్ ఎల్లాపని చేస్తుందో చూసి ఆలోచిస్తామన్నారు.

### గ్రామవైద్యులకువిరాళాలు

ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి శ్రీ పి. వెంకటరమణప్ప ప్రశ్నకు సమాధానంఇస్తూ గ్రామాల్లోని ఆస్పత్రులలో పనిచేస్తే వైద్యులకు విరాళాలు పెంచే సంకల్పం ప్రభుత్వానికి లేదనిచెప్పారు.

రాయబారాలకు ప్రభుత్వం అప్పటికప్పుడు సమాధానం ఇవ్వరనీ పరిశీలిస్తామని మాత్రం చెప్తారని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యకు ముఖ్యమంత్రి తెలియజేశారు.

పాలీసా వాలును వందలు ఇచ్చేదాని కన్న గ్రామవైద్యులు హెచ్చు సేవ చేయగలగడానికి వెలుపవందరూపాయలు ఇచ్చే విషయం ఆలోచిస్తారా యని శ్రీ బి. రామారెడ్డి అడిగారు.

ఇచ్చే ఉద్దేశ్యంలేదనీ, అయితేవారు ఇచ్చిన విజ్ఞప్తి పరిశీలనలో వుందనీ మంత్రి చెప్పారు.

### అడవుల సలహా సంఘం

ఒక ప్రశ్నకు సమాధానం ఇస్తూ వ్యవసాయ మంత్రి శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి రాష్ట్రీ ఆటవిక సలహా సంఘం ఒక దానిని ఏర్పాటు చేయవచ్చని సూచించారు.

శ్రీ ఎస్. కాశిరెడ్డికి సమాధానంగా నెల్లూరుజిల్లాలోని రిజర్వుఅడవుల సర్వే సెటిల్‌మెంటు పనిని ప్రత్యేక సిబ్బందికి వప్పగించామనీ, పని జరుగుతోందని తెలియజేశారు. పాడిలి, దర్శి తాలూకాలలో పని ఎప్పుడు ప్రారంభమయ్యేది చెప్పలేమన్నారు.

శ్రీ జి. యల్లమందారెడ్డి ప్రశ్నకు సమాధానం ఇస్తూ ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న జమీందారీ అడవుల సెటిల్‌మెంటు ప్రారంభమైందని చెప్పారు.

కాశిరెడ్డి మరో ప్రశ్నకు సమాధానంగా రిజర్వు అడవులకు సమీపంలోవుండే ప్రజల కష్టాలు, ఇబ్బందులు గూర్చి పరిశీలించి ప్రభుత్వానికి నివేదించటానికి సంఘాన్ని నియమించాలనే ఆలోచన లేదని వ్యవసాయ మంత్రి చెప్పారు.

శ్రీ శివయ్య ఉప ప్రశ్నకు సమాధానంగా చిన్న నేరాలు చేసిన వారిపై చర్యతీసుకొనే ముందు ఆ ప్రాంత శాసన సభ్యులను సంప్రదించాలని అటవీ శాఖ జిల్లా అధికారి ఉత్తర్వు ఇచ్చారా అనగా అటువంటి పుట్టించి వుండాలని అన్నారు. తెలంగాణాలో ఇదివరకు రైతులకు వున్న సౌకర్యాలు తగ్గించివుంటే తమకు వ్రాస్తే పరిశీలిస్తామన్నారు.

నెల్లూరుజిల్లాలో ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న ఎస్టేట్లలో తాత్కాలికంగా నిర్ణయించిన రిజర్వు హద్దులు ప్రజలకు అసౌకర్యంగా వున్న సంగతి ప్రభుత్వానికి తెలుసునని వ్యవసాయ మంత్రి శ్రీ కాశిరెడ్డి మరో ప్రశ్నకు సమాధానం ఇచ్చారు.

గ్రామస్థులకు పసువులకు ఇబ్బంది లేకుండా చేసేందుకు ఎస్టేటు అడవుల సర్వే, సెటిల్‌మెంటును శీఘ్రంగా జరిపించటానికి ప్రత్యేక సిబ్బందిని నియమించాం. హద్దులను నిర్ణయించే టప్పుడు శాసనసభా సభ్యుల సహకారం తీసుకోవలసిందని అటవీశాఖ ఉద్యోగులకు ప్రభుత్వం సూచించిందనికూడా మంత్రి తెలియజేశారు.

### కార్మిక న్యాయస్థానాల తీర్పు గతి

కార్మికమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య శ్రీ వేమయ్యకు సమాధానం చెబ్తూ కార్మిక న్యాయస్థానం తీర్పు ననుసరించి గుంటూరులోని పాదర్తి రత్నం అండ్ కంపెనీ కార్మికులకు 1956 సెప్టెంబరు 19 న పరిహారం చెల్లించలేదని చెప్పారు.

యజమానులు ప్రధాన న్యాయస్థానంలో రిట్ దాఖలుచేశారన్నారు.

మరో ప్రశ్నకు సమాధానంగా గుంటూరు జిల్లాలోని కృష్ణానంద భవన్ పనివారికి కూడా కార్మిక న్యాయస్థానం నిర్ణయించిన పరిహారం చెల్లించలేదనీ ఆ యజమానులు కూడా రిట్ దరఖాస్తు దాఖలుచేసి న్యాయస్థానం తీర్పు అమలును నిలుపుదల చేశారని మంత్రి తెలియజేశారు.

గుంటూరు బియ్యం మరలను 1956 జనవరి నుండి యజమానులు మూసివేయలేదు కాని నిరుడు అక్టోబరు 10 తేదీన యజమానులకు పనివారికి పేచీ రావటం వల్ల గుంటూరులోని బియ్యం మరలను మూసివేశారని కార్మికమంత్రి మరో ప్రశ్నకు సమాధానం చెప్పారు. ఇందువలన 95 మంది ముఠాకార్మికులకు నష్టం కలిగింది కాని వారికి ఏమీ ఇవ్వలేదని చెప్పారు.

### విశాఖలో కార్బన్ బ్లాక్ ఫ్యాక్టరి

విశాఖపట్టణంలో కార్బన్ - బ్లాక్ ఫ్యాక్టరీ నెలకొల్పాలని కేంద్రం ఆలోచిస్తున్న విషయమై తెలుసునా అని శ్రీ యం. నాగిరెడ్డి ప్రశ్నించగా, అటువంటి ఫ్యాక్టరీ స్థాపించాలని కేంద్రం వుద్దేశిస్తున్నట్లు తెలుసుగాని, ఖచ్చితంగా ఎప్పుడు ఎక్కడ నెలకొల్పేదీ మాత్రం తెలియదని ముఖ్యమంత్రి సమాధానమిచ్చారు.

### సబ్బుల ఫ్యాక్టరీలు

శ్రీ సందా నారాయణప్ప ప్రశ్నకు శ్రీ సంజీవరెడ్డి సమాధానమిస్తూ రాష్ట్రంలో ఇప్పటికే సబ్బుల ఫ్యాక్టరీలు ఎక్కువైపోయాయని, తగిన ముడిపదార్థాలు లభ్యమయినా ఇక వాటిని స్థాపించే ఆలోచనలేదని చెప్పారు. సబ్బుల ఫ్యాక్టరీలు ఎక్కువై కొన్ని దివాళా తీశాయనికూడా చెప్పారు. విజయవాడలోని వసంత్ సబ్బుల ఫ్యాక్టరీకి ప్రభుత్వం రు 1 లక్ష ఋణమిచ్చిన సంగతి వెల్లడించారు.

బొగ్గుపరిశ్రమకు సంబంధించిన పెద్ద ఫ్యాక్టరీ స్థాపనగురించి వుద్దేశం వున్నట్లు కేంద్రంవద్ద నుంచి కబురేమీ రాలేదని శ్రీ యస్. కాశిరెడ్డికి తెలియజేశారు. అయితే ప్రభుత్వం యీ ఫ్యాక్టరీ స్థాపనకు రు 2 కోట్లు ఖర్చు పెట్టాలని తెలియజేశారు.

మదరాసు క్రైస్తవ కళాశాల ఆంధ్రభాషాభి రంజనీ సంఘ ప్రారంభోత్సవం జూలై 15 వ జరిగింది: అధ్యక్షుడు డా॥ కె. వి. స్వామి, ఉపన్యాసకులు శ్రీ మోటూరి సత్యనారాయణ, సంఘం అధ్యక్షుడు శ్రీ ఫ్రాన్సిస్, విద్యార్థి అధ్యక్షుడు శ్రీ వి. రఘునాథరెడ్డి వున్నారు.

# చట్టవిరుద్ధంగా వ్యవహరిస్తే ఎవరినైనా శిక్షించవలసిందే

## యజమాన్లూ, కార్మికులూ సమానమేనని కార్మిక మంత్రి హెచ్చరిక

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి)

హైదరాబాదు, జూలై 25: యజమానులయినా సరే— లేదా కార్మికులయినా సరే— చట్టవిరుద్ధంగా వ్యవహరిస్తే కఠినమైన చర్య తీసుకోక తప్పదని ఇవాళ్ళ శాసనసభలో కార్మిక, సాంఘిక సంక్షేమ శాఖల మంత్రి శ్రీ సంజీవయ్య స్పష్టంచేశారు.

కార్మిక, సాంఘిక సంక్షేమ శాఖల పద్దు రూ 2,98,06,800 లో కొంత తగ్గించాలని సభ్యులు తెచ్చిన కోత తీర్మానాలను ప్రతిఘటిస్తూ మంత్రి పైవిధంగా చెప్పారు. మంత్రి సమాధానం తరువాత పద్దును సభ ఆమోదించింది.

మంత్రి సంజీవయ్య ఇంకా ఇట్లా చెప్పారు: "ఈ చర్చ సందర్భంలో సభ్యులు చాలా సూచనలు చేశారు. వాటన్నింటినీ ప్రభుత్వం పరిశీలిస్తుంది. అయితే వాటిలో ఆచరణ సాధ్యమైన వేవో, కానివేవో చూడాలి. అంతే కాక వాటిలో వేటిని ముందు అమలు జరపాలి, వేటిని తరువాత చేయవచ్చునో కూడా చూడవలసి ఉన్నది.

### అలస్యం జరుగుతున్నది

"కార్మిక శాఖలోనూ, కార్మికుల తగాదాలను పరిష్కరించడంలోనూ, ఆలస్యం జరుగుతున్న మాట నిజమే. కార్మిక న్యాయస్థానాలు చెప్పిన తీర్పులను అమలు జరపడంలో ప్రభుత్వం అశ్రద్ధ చేస్తోందనడం మాత్రం సరికాదు."

"హైదరాబాదులోనే 'టాజ్ గ్లాస్ ఫ్యాక్టరీ' యజమానులపై (ప్రాసిక్యూషన్) నేరవిచారణ ప్రారంభించాము. కరీంనగరం జిల్లాలో పెద్దపల్లిలో ఒక ఫ్యాక్టరీ కార్మికులకు న్యాయస్థానం తీర్పుప్రకారం రావలసిన రు 18 వేలనూ, భూమిశిస్తు చట్టం ప్రకారం-అవసరమైతే ఆస్తిని జప్తుచేసి అయినా సరే వసూలుచేయవలసినదిగా కలెక్టరుకు ఉత్తరువులు ఇచ్చాము. యజమానిపై నేరవిచారణ కూడా జరిపించాము."

ఒక సభ్యుడు:- సామర్లకోట కార్మికుల తగాదా సందర్భంలో తీర్పు వచ్చి ఇప్పటికి ఎనిమిది నెలలయినా అమలు జరుగలేదు.

మంత్రి:- రాజీకోసం ఇంకా ప్రయత్నిస్తున్నాము. యజమానులపై నేరారోపణలు చేసి జైళ్ళకు పంపించినంత మాత్రాన నే కార్మికులకు కానీ, దేశానికి కానీ ప్రయోజనం ఉంటుందనుకోను.

శ్రీ టి. అంజయ్య:—కార్మికులను జైళ్ళకు పంపిస్తే ఉంటుందా? (ప్రతిపక్ష సభ్యుల హర్షధ్వానాలు)

మంత్రి:—కార్మికులను జైళ్ళకు పంపించిన సందర్భాలు నాకు తెలియవు. కార్మికులయినా సరే - యజమానులయినా సరే - చట్టవిరుద్ధంగా వ్యవహరిస్తే కఠిన చర్య తీసుకోక తప్పదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:— ఒక యజమానిమీద నైనా సరే చర్య తీసుకున్న సందర్భం సెలవిస్తారా.

మంత్రి:—"గౌరవ సభ్యుడు సభలోకి ఇప్పుడే వచ్చినట్టున్నారు... శ్రమకు తగ్గ ఫలితాన్ని, గౌరవాన్నీ కల్పించాలనే మా కోరిక. ఒక ఫ్యాక్టరీలో అధికసంఖ్యాకులయిన కార్మికుల కోసం రు 9 లక్షలు చెల్లించి, నిర్వాహకులూ, గుమాస్తాలకోసం రు 28 లక్షలు ఖర్చుచేస్తున్నారట! ఇదెక్కడి న్యాయం!! ఈ నాడైనా ఈస్థితిని తొలగించేందుకు ప్రభుత్వానికి గల అధికారాలేమిటో తెలియదు."

### యజమానులకు సలహా

"ఈ సందర్భంలో యజమానులకు నాదొక సలహా. అధిక వేతనాలిచ్చే యజమాని అధికలాభాలు సంపాదించగలడు. సరిపోయే వేతనాలు ఇవ్వకపోతే లాభంకూడా తక్కువగానే ఉటుంది."

"కార్మికుల జీవితంలోగానీ, సమస్యలలోగానీ ఏమాత్రమూ సంబంధంలేని కొందరు కార్మిక నాయకులం అని చెప్పుకొంటూ కార్మికులను పెడదోవ త్రొక్కిస్తున్నారు. ఇటువంటి అవకాశం వారికి లేకుండా చేయడం అవసరం. కార్మికులనూ, వారి ప్రయోజనాలనూ ఎటువంటి పరిస్థితులలోనైనా సరే పరిరక్షిస్తామని మాట ఇస్తున్నాను."

### రాజమండ్రికాగితాల మిల్లు కార్మికులు

"అందరితోపాటు వారికికూడా రుణ అదనపు కరువుభత్యం ఇస్తామని రాజమండ్రి కాగితాల మిల్లులోని కార్మికులకు మాట ఇచ్చిన సంగతి నిజం కావచ్చు. కేంద్రప్రభుత్వం కూడా కొంత సహాయం ఇస్తుందన్న నమ్మకంతో రుణ అదనపు కరువుభత్యం మంజూరు చేయడం జరిగింది. మరి పరిశ్రమలలో పనిచేసే వాళ్ళకు ఈ రుణ అదనపు కరువు భత్యం వర్తించదని కేంద్రప్రభుత్వంచెబితే ఏమిచేయాల్లో శ్రీ సుందరయ్య చెప్పాలి. ఈ అదనపు కరువుభత్యం సౌకర్యంవల్ల పబ్లిక్ వర్క్సు శాఖ ఉద్యోగులకూ, హైదరాబాదు పురపాలకసంఘ కార్మికులకూకూడా ప్రయోజనం కలగడంలేదని తెలుస్తోంది. ఈసమస్యపై ప్రభుత్వం త్వరలో ఒక నిర్ణయం చేస్తుంది."

"ఈ సంవత్సరం అదనంగా 14 వేల మంది కార్మికులకు ప్రభుత్వభీమా పథకాన్ని అన్వయింపచెయ్యాలని అనుకున్నాం. కానీ, డబ్బులేనందున ఈ పథకాన్ని మానుకోవలసివచ్చింది— కేంద్రప్రభుత్వం ఈపద్దున ఇచ్చే ధనసహాయాన్నికూడా వదులుకోవలసి వచ్చింది."

"అపాయకరమైన యంత్రాలున్న కర్మాగారాలలోని కార్మికులకు కల్పించవలసిన రక్షణల సందర్భంలో ఇప్పుడున్న శాసనాలను ప్రభుత్వం అమలు జరుపుతోంది. తెలియక కొందరు యజమానులు ఈ చట్టాలను అమలు జరపడం లేదు. అందుకని వస్తు ప్రదర్శనశాలవంటి దానిని హైదరాబాదులో ఏర్పాటు చేసి కర్మాగారాలలో అసలు అపాయాలు ఎట్లా జరుగుతాయో, వాటిని ఎట్లా నివారించాలో కార్మిక శాఖ అధికారులకూ పరిశ్రమల యజమానులకూ తెలియచెప్పాలని నిర్ణయించాము. ఇందుకు రు 1 లక్ష కేటాయించాం కూడా."

### కొంత తెలిసీ కొంత తెలియకా...

శ్రీ సుందరయ్య: తెలియనందువల్లనే ఇప్పుడు అమలు జరగడం లేదా?

మంత్రి: కొంత తెలిసీ—కొంత తెలియకా...

ఒక సభ్యుడు: మరి ఈ వస్తు ప్రదర్శన శాలలను పరిశ్రమల యజమానులందరూ విధిగా చూడాలని చట్టం ఏమైనా చేస్తారా?

మంత్రి: ఆలోచిస్తాం. ఈ పథకానికి ఈ సాలుకు రు 10 లక్షలు కావాలి. కేంద్ర ప్రభుత్వం రు 6 లక్షలు ఇస్తానన్నది లోగడ. ఇప్పుడు అదీ ఇవ్వం అని అంటున్నారు. దీనికి సంబంధించిన వివరాలను నిర్ణయించడానికి త్వరలో ఒక సంఘాన్ని ఏర్పాటు చేస్తాము."

### తరతరాలుగా వస్తున్న దురాచారం

"అస్పృశ్యత అనేది తరతరాలుగా వస్తున్న దురాచారం. వెంటనే నిర్మూలించలేమని. అయితే నిర్మూలన అసాధ్యం అని నేను అనుకోను. మూడవ పంచవర్ష ప్రణాళిక అఖరికి ఈ దురాచారం అదృశ్యం అవుతుందని అనుకుంటున్నాను. అయితే ఇందుకోసం మదరాసు రాష్ట్రంలోని చట్టం ఇక్కడ కూడా అమలు చెయ్యడమూ లేక పోలీసులకు అదనంగా అధికారాలు ఇచ్చి అయినా సరే కేంద్రప్రభుత్వ చట్టాన్ని ఇంకా కట్టుదిట్టంగా అమలు జరపడమూ అని ఆలోచిస్తున్నాము."

"దారిద్ర్యాన్ని నిర్మూలించి ఆర్థిక స్తోమతును కల్పిస్తే ఈ సమస్య పరిష్కారమవుతుందని కొందరు అంటారు. కానీ దానితోపాటు విజ్ఞానం వికాసం కూడా కావాలి. అందుకు అందరూ కృషి చెయ్యాలి."

"భూమి సేకరణ చట్టంలోని అవసర నిబంధనలను అమలు జరిపించి అయినా సరే హరిజనులకు నివేశన స్థలాలను ఇప్పిస్తాము."

"ఈశాఖకు చేసిన కేటాయింపు తక్కువ అని విలపించి లాభం లేదు. ప్రణాళికాబద్ధంగా మన అభ్యున్నతి జరుగుతున్నది. దాని ననుసరించే కేటాయింపులు జరుగుతున్నవి."

"హరిజనులకు వ్యవసాయ భూములను ఇచ్చే సందర్భంలో హైదరాబాదు చట్టంలోని నిబంధనలనూ ఆంధ్రలోని భూమికేటాయింపు చట్టం నిబంధనలనూ పూర్తిగా అమలు జరుపుతాము. 1948 కి పూర్వం హరిజనుల స్వాధీనంలో ఉన్న భూములను రాజకీయ బాధితులకుగానీ, మరెవరికీగానీ ఇవ్వడం జరగదని ముఖ్యమంత్రి ఇచ్చిన హామీని మరొకసారి చెబుతున్నాను. ఇంతవరకూ దాదాపు 2 లక్షల 50 వేల ఎకరాల ప్రభుత్వ భూమిని హరిజనులకు ఇచ్చాము."

"ఫీల్డ్ లేబర్ సహకార సంఘాలకు పరపతి సమకూర్చేందుకు ఆర్థిక సహాయ సంస్థ ఒకదానిని ఏర్పాటుచేసే సంగతి ఆలోచనలో ఉన్నది. హరిజనులకు ప్రత్యేకంగా సహకార సంఘాలను ఏర్పాటు చేయడంవాంఛనీయంకాదు."

"రాజ్యాంగంలో అస్పృశ్యతను రద్దుపరుస్తూ నిర్ణయించారు. వేరే చట్టాలను కూడా చేశాము. అయినా కూడా ఇంకా ఈ అంటరానితనం ఉండడం శోచనీయం. దీనిని పాటించేది లేదని ప్రతివ్యక్తి శపథం చేస్తేనే ఇది అంతరిస్తుంది. పర్యటనలలో హరిజనవాడలకు ప్రత్యేకంగా వెళ్ళి సపంక్తి భోజనాల వంటి వాటిని ఏర్పాటు చేయడం ద్వారా దీనినిర్మూలనకు శాసనసభ్యులు తోడ్పడాలి."

శ్రీ కె. ఎల్. నరసింహారావు తెచ్చిన కోత తీర్మానంపై వోటింగు జరుగగా 38 మంది అనుకూలంగానూ, 89 మంది వ్యతిరేకంగానూ వోటు చేశారు. కోతతీర్మానం వీగిపోయింది.

శ్రీ గోపిడ గంగారెడ్డి ప్రతిపాదించిన కోతతీర్మానానికి అనుకూలంగా 42 మందీ, వ్యతిరేకంగా 92 మందీ వోటుచేశారు. అదికూడా వీగిపోయింది.

### డబ్బు చాలదు

ఇవాళ్ళ శాసన సభలో ప్రశ్నోత్తరాలు అయిన తరువాత నిమ్న జాతులూ, కొండ జాతుల సంక్షేమపద్దుపై చర్చ జరిగింది. ఈ పద్దుకు కేటాయించిన డబ్బు చాలదనీ, కేటాయించిన డబ్బునైనా సవ్యంగా వినియోగించడంలేదనీ పలువురు సభ్యులు విమర్శించారు.

కొండజాతులకు వ్యవసాయ పద్ధతులను నేర్పి సాగుచేసేందుకుభూమిఇవ్వాలని శ్రీ డి. గోపాలరావు అన్నారు.

క్రైస్తవ మతంలోకి మారిన హరిజనులకు తెలంగాణాలో హరిజనులకు ఇచ్చే సౌకర్యాలను ఇప్పించ వలసినదిగా శ్రీ ఆంథోనిరెడ్డి విజ్ఞప్తి చేశారు.

మహిళలకూ, పురుషులకూ సమానంగా వేతనాలను నిర్ణయించ వలసినదిగా శ్రీమతి మసూమా బేగం సూచించారు.

బ్రిటిష్ పరిపాలన పోయినా, ఆ పద్ధతులు మాత్రం ఇంకా పోలేదని విజయనగరం మహారాణి విమర్శించారు.

హరిజనులకు ప్రత్యేకంగా బావులు అనవసరమని శ్రీమతి ఆరుట్ల కమలాదేవి వివరించారు.

అంతలో సాంఘిక సంక్షేమశాఖ మంత్రి కల్పించుకొని ఇట్లా చెప్పారు: "అంటరాని తనాన్ని నిర్మూలించాలన్న కృషి సందర్భంలో మీ ఊరికి చేరువలోని ఒక గ్రామంలో మాలలూ, మాదిగలు చేత ఒకే ఒక బావిలో నీళ్లు తాగించలేక పోయినాను. కనుక వాస్తవాలను గమనించాలి."

హరిజనుల ఆర్థికస్థితిని బాగుచెయ్యాలని శ్రీమతి కమలాదేవి చెప్పారు.

తెలంగాణాలో భూమి సంస్కరణలు సరిగ్గా అమలు జరగడం లేదనీ, పేదలకు భూములు లభించడం లేదనీ శ్రీ జి. రామలింగం అన్నారు.

హరిజనుల అభ్యున్నతికీ, అస్పృశ్యతా నివారణకూ కేటాయించే సొమ్ము హరిజనులకు అందడం లేదనీ, ఉద్యోగులకే సరిపోతున్నదనీ శ్రీమతి సుమిత్రాదేవి అన్నారు.

అత్తి సొమ్ము అల్లుడు దానం చేసినట్టున్నది ప్రభుత్వ వ్యవహారం అని ఆమె అనగా "అది సభా మర్యాదకు తగిన మాటేనా?" అని సభాపతిని సాంఘిక సంక్షేమశాఖ మంత్రి అడిగారు.

ఆమాటల అర్థం తనకు సరిగ్గా తెలియటంలేదని సభాపతి అన్నారు.

భద్రాచలం తాలూకాలో కొండ జాతులవారు "యాస్" మలేరియా వంటి వ్యాధులవల్ల బాధపడుతున్నారనీ, ఆసుపత్రులలో మందులుంటే వైద్యులుండరు-వైద్యులుంటే మందులుండవని శ్రీమతి వాణీ రమణరావు చెప్పారు. కొండజాతుల అభ్యున్నతికి వెచ్చించే సొమ్ము సవ్యంగా ఖర్చయ్యేట్టు చూడవలసినదిగా ఆమె విజ్ఞప్తి చేశారు.

### ఇంజనీరింగు డిప్లొమా కోర్సు

#### కేంద్రం గుర్తింపుకు అభ్యర్థన

హైదరాబాదు, జూలై 22: 1955 ఆగస్టు 1 నుంచి కాకినాడ, అనంతపురం ఇంజనీరింగు కళాశాలలలో రాష్ట్రప్రభుత్వం ప్రారంభించిన డిప్లొమా కోర్సులకు కేంద్రం గుర్తింపు లభింపజేయాలని, రెండేళ్ళ వుద్యోగం చేసిన వారికి డిగ్రీని పొందే అవకాశం కలిగించాలని కోరుతూ ముఖ్యమంత్రికి, విద్యామంత్రికి, డిప్లొమా విద్యార్థుల ప్రతినిధులు శ్రీ వి. యస్. చౌదరి, శ్రీ దేవరపల్లి మస్తాన్‌రావు, వినతిపత్రాలు సమర్పించారు.

శాసనసభ్యులు శ్రీ ప్రగడ కోటయ్య శ్రీ కల్లూరు సుబ్బారావు, శ్రీ పిడతల రంగారెడ్డి, ప్రభృతులు కూడా వచ్చి ముఖ్యమంత్రికి నచ్చజెప్పారు. ఈ విషయం అధికారులకు తెలియబరచగలమని శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

తరువాత సాంకేతిక విద్యాశాఖ డైరెక్టర్లను కలుసుకుని ఎ.యం.ఐ.ఇ. పరీక్షలకు "బి" పార్టుకు తమకు మినహాయింపు ఇప్పించే ప్రయత్నం చేయాలని కోరుతూ విజ్ఞప్తి సమర్పించారు.

రెండు మూడు నెలలలో ఏ సంగతి తెలియజేస్తామని డిప్యూటీ డైరెక్టరు చెప్పారు.

విద్యార్థులలో వెనుకబడిన జాతుల వారికి ఉపకార వేతనాలు సరిగా సకాలంలో అందేటట్లు చూడాలని కోరుతూ ఒక విజ్ఞప్తి పత్రాన్ని శ్రీ ప్రగడ కోటయ్య ద్వారా మంత్రి శ్రీ సంజీవయ్య, సాంఘిక సంక్షేమ డైరెక్టరు శ్రీ యాగంటి గారలకు అందజేశారు.

### వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

#### ఉపాధ్యక్షుని ఎన్నిక తేదీ వివరాలు

తిరుపతి, జూలై 22: శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవినుంచి శ్రీ యస్. గోవిందరాజులు నాయుడు సెప్టెంబరు 2 నుంచి విరమిస్తారు. ఈ విశ్వవిద్యాలయానికి సంబంధించిన చట్టంప్రకారం ఇకనుంచి ఉపాధ్యక్షులను సెనేట్ మాత్రమే ఎన్నుకోవలసి వుంటుంది.

ఈ ఎన్నికకు పోటీచేసేవారు తమ అభ్యర్థి పత్రాలనుఆగస్టు 18సాయంత్రంలోగా పంపాలి. ఉపసంహారణలు 19 సాయంత్రంలోగా జరగాలి. పోటీ వుంటే 24 తేదీన లెక్కింపు జరుగుతుంది. ఆరోజునే సెనేట్ సమావేశం జరుగుతుంది.

ఈ వివరాలను రిజిస్ట్రారు ప్రకటించారు.

### బళ్లారి పురపాలక ఎన్నికల ఏర్పాట్లు

బళ్లారి, జూలై 22: పురపాలకసంఘ ఎన్నికల నిమిత్తం పట్టణాన్ని 8 డివిజన్లుగా విభజించారు. ఇవి బహుళ సభ్య నియోజక వర్గాలు. అయిదు డివిజన్లకు నాలుగేసి స్థానాలు, ఒకదానికి 5, మరొకదానికి 3, మొత్తం 32 స్థానాలు వున్నాయి. మూడుస్థానాలు నిమ్నజాతులకు కేటాయించారు.

### తణుకులో జమాబంది

#### మామూలుగా జరుగుతోంది

తణుకు, జూలై 22: తణుకుతాలూకా జమాబంది మామూలుగా జరుగుతోంది. గ్రామకరణాలందరూ హాజరవుతున్నారు. నిన్నటి నుంచి జమాబంది ప్రారంభమైనది.

### తెలుగు భాషాసమితి

#### ఉత్తమగ్రంథాలకు ఆంధ్ర ప్రభుత్వ బహుమతులు

మద్రాసు, జూలై 25: తెలుగుభాషా సమితి 1954-55, 1955-56 సంవత్సరములకు బహుమతిపోటీ పరీక్షల కు నిర్ణయించిన విషయములపైవచ్చిన గ్రంథములలో ఉత్తమములని నిర్ణయమైనవాటికి ఆంధ్రప్రభుత్వంచే నిర్ణీతమైన బహుమానములను ఆదివారం జూలై 28వ తేదీ సా 6 గంటలకు హైదరాబాదు నగరమున ప్రతాపగిరి కోఠీలో ఏర్పాటుచేసిఉన్న సమితి వార్షికసభయందు ఆయాగ్రంథకర్తలకిచ్చుటకు సుప్రీముకోర్టుజడ్జి శ్రీ బచ్చు జగన్నాథదాసు అంగీకరించినారు.

సమితిఅధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ ఆర్థికమంత్రి డా॥ బెజవాడ గోపాలరెడ్డి సభకు అధ్యక్షత వహింతురు.

#### బహుమతిగ్రంథాల వివరణ

1954-55 సం. (1) నాటకకళ అనే గ్రంథం-శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి (2) అనురాగిణి తెలుగు (స్వతంత్ర కావ్యం) శ్రీ వజ్ఝల వెంకటేశ్వరులు.

1955-56 సం. (1) ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర-శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు (2) భూగర్భశాస్త్రము-శ్రీ యస్. యల్. నరసింహారావు (3) పిల్లల నాటికలు బాలసాహిత్యము (నాటికల సంపుటి) శ్రీ మతి-పి. సీతారాజ్యలక్ష్మి (4) ఆంధ్ర శిల్ప పరిచయము. డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి (5) ఆరామ కల్ప తరువు-శ్రీ బ్రహ్మాండం వరసింహం.

### పాఠ్యగ్రంథాల ప్రచురణ కర్తలకు సూచన

కర్నూలు, జూలై 28: 1959 లో జరిగే స్కూల్ ఫైనల్ పరీక్షకు ఆంగ్ల, హిందీ, ఉర్దూ, ఉపవాచకాల (నాన్ డిటెయిల్డ్) నిర్ణయ నిమిత్తం ప్రచురణ కర్తలు ఒక్కొక్క పుస్తకానికి ఆరేసి ప్రతులను సెప్టెంబరు 16 లోగా పంపాలని ప్రభుత్వ పరీక్షల కమీషనరు కార్యదర్శి ప్రకటిస్తున్నారు.

### హిందీపరీక్షల తేదీలలో మార్పులేదు

విజయవాడ, జూలై 28: దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచారసంఘం నిర్వహించే హిందీ ప్రారంభిక, ఉన్నత పరీక్షలు లోగడ నిర్ణయించిన ప్రకారం ఆగస్టు 24, 25, 26 తేదీలలో జరగగలవు.

ప్రారంభిక పరీక్షలు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలు 25 వ తేదీ ఆదివారంనాడు జరగగలవు. ఈ తేదీలలో మార్పులేదని పరీక్షార్థులు గమనించాలని ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘ కార్యదర్శి శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య కోరుతున్నారు.

### మడకశిర తాలూకా కాంగ్రెసు వినతి

మడకశిర, జూలై 20: గ్రామోద్యోగులు మునుపటికన్నా ఇప్పుడు అదనంగా కొన్ని ప్రభుత్వపనులను చేయవలసివస్తోంది కాబట్టి వారి కోరికలను సానుభూతిలో పరిశీలించి మిగతా ఉద్యోగులతోపాటు వీరికి కూడా తాత్కాలికంగా కొంతసహాయం చేయాలని తాలూకా కాంగ్రెసు సంఘం విజ్ఞప్తిచేసింది. (స్వ. వి.)

### రాజంపేటలో నీరా తాటిబెల్లం కేంద్రం

రాజంపేట, జూలై 28: నూతనంగా ఇక్కడ నెలకొల్పిన నీరా, తాటిబెల్లం సహకార విక్రయ సంఘానికి పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు శ్రీ దీనదయాళు నాయుడు నిన్న ప్రారంభోత్సవం జరిపారు.

సభకు సర్కిల్ యిన్‌స్పెక్టరు శ్రీ రామ్‌సింగ్, సబ్ మేజస్ట్రేట్ శ్రీ సీతారామశాస్త్రి, కె. నరసారెడ్డి మొదలైనవారు పాల్గొన్నారు. (స్వ. వి.)

### కల్తీమందులు అమ్మిన వర్తకుని విచారణ

#### ఆగస్టు 5 కు వాయిదా

హైదరాబాదు, జూలై 25: కల్తీచేసిన మందులకు తప్పుడుచీటీలు అతికించి ప్రభుత్వస్టోర్సుకు సరఫరా చేశాడని సుల్తాన్ బజార్ వర్తకుడు శ్రీ శ్రీమన్ అగర్వాల్ పైచేసిన ఆరోపణ తిరిగి ఆగస్టు 5 వ తేదీన విచారణకు వస్తుంది.

ఈ నేరవిచారణ నిన్న జరుగవలసింది. కానీ జిల్లామేజస్ట్రేట్ శ్రీ వై. వెంకటేశ్వరరావు సెలవుమీద ఉన్నందున ఇవాల్టికి వాయిదా వేశారు.

పోలీసుల తరఫున నేరారోపకుడు ఈ వేళ విచారణకు హాజరు కాలేక పోయారు. అందువల్ల మిగిలిన సాక్షుల విచారణ ఆగస్టు 5 వ తేదీన జరుగుతుంది.

### హరిజన సంక్షేమ శాఖ కేటాయింపు

#### పరిశీలనకు సంఘం

హైదరాబాద్, జూలై 25: హరిజనుల అభ్యున్నతికి బడ్జెట్‌లో కేటాయించిన మొత్తం చాలదని నిన్న జరిగిన శాసనసభా కాంగ్రెసు పక్ష సమావేశంలో పలువురు హరిజన శాసన సభ్యులు సూచించారట. దానిమీదట ఈ వ్యవహారం పరిశీలించేందుకు మంత్రి శ్రీ సంజీవయ్య అధ్యక్షతన ఒక ఉప సంఘాన్ని శాసనసభా కాంగ్రెసు నాయకుడు నియమించారని తెలుస్తున్నది.

### కడప జిల్లాజడ్జికి వీడ్కోలు

కడప, జూలై 22: జిల్లా సెషన్సుజడ్జి శ్రీ యస్. నారాయణరావు కృష్ణా జిల్లాకు బదిలీఅయిన సందర్భంలో న్యాయవాదసంఘం వీడ్కోలిచ్చింది.

శ్రీయుతులు జి. సుబ్బారావు, యస్. సంజీవరెడ్డి, యస్. రంగారెడ్డి, ప్రభృతులు న్యాయమూర్తి ప్రతిభా విశేషాల సుగడించారు. శ్రీ నారాయణరావు ఉచితరీతిని సమాధానమిచ్చారు. శ్రీ యం. కె. షెర్వానీ వందనసమర్పించారు.

#### వివాహం

కడపజిల్లా కలెక్టరు జనాబ్ సయద్ అహమద్ తమ కుమార్తె వాదత్ బేగమ్‌ను ఎ. మహమద్ షరీఫ్ సాహెబ్ కిచ్చి యీనెల 18 వ వైభవంగా వివాహంచేశారు. రాష్ట్ర మంత్రులు, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి బషీర్ అహమ్మద్, శ్రీ కోత్తి రఘురామయ్య ప్రభృతులు శుభాశీస్సులు పంపారు.

### అసభ్య ప్రవర్తనకు ఇద్దరు స్త్రీలకు శిక్ష

ఒంగోలు, జూలై 23: మొన్న ఉదయం రోడ్డుమీద అర్ధనగ్నంగా నుబడి అసభ్యమైన పాటలు పాడుతూ ప్రజలను ఆకర్షించడానికి ప్రయత్నించిన నేరానికి పి. కోటమ్మ, యం. సరోజిని అనే ఇద్దరు స్త్రీలకు రెండేసీ నెలల లేదిక శిక్షను విధిస్తూ స్టేషన్ సబ్ మేజిస్ట్రేటు శ్రీ కె. వి. ఆంజనేయులు తీర్పునిచ్చారు. స్వ. వి.

### గుంటూరు కెమెరా క్లబ్

గుంటూరు, జూలై 22: కెమెరా క్లబ్ ద్వితీయ వార్షికోత్సవం పబ్లిసిటీ పోషకశాఖ డైరెక్టరు శ్రీ భగవాన్‌దాసు అధ్యక్షతన జరిగింది. కుమారి ఉమాజోసఫిన్ ప్రార్థన చేసింది. శ్రీ యల్. మాలకొండయ్య స్వాగతమిస్తూ శ్రీ భగవాన్‌దాసు ఇదివరలో క్లబ్ అధ్యక్షులుగా చేసినసేవను ప్రశంసించారు. [illegible] చిత్రప్రదర్శనలో [illegible] శ్రీమతి సత్యభామారెడ్డి బహుమతులు పంచారు. శ్రీ పి. మృత్యుంజయరావు వందన సమర్పించారు. (స్వ. వి.)

## గంటల పంచాంగం

హేమలంబసం॥ ఆషాఢ బ॥అమావాస్య
1957 సం॥ జూలై 27 శనివారం
శ॥ అమావాస్య 9-58 పుష్య 19-38
శే వర్జ్యం 6-50 కు.

శ్రావణమాసము
శు॥ ప్రథమ జూలై 28 ఆదివారం
ఆ॥ ప్రథమ 6-21 ద్వితీయ రా 2-41
ఆశ్రే 16-46 వర్జ్యం 6-54 ల 8-18 కు
వర్జ్యం రా 8-22 ల 4-47 కు.

ఆంధ్రపత్రిక

ఉదయే యది యొదరించిన
సరసర యుక్తియము శరసముఖ శగు దా
సాదులకు సనిసేయుకుని
సరాయణము సరముధర్మ సభముం శేర్లనే
(మహాభారతము)

హేమలంబసం॥ఆషాఢ బ॥ అమావాస్య
శనివారం

## సమగ్ర విచారణ అవసరం

గ్రామోద్యోగుల సమస్యలపై తగు విచారణ జరిపి రెండు నెలలలో నివేదికను సమర్పించడానికి ఆంధ్రప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. ఈలోగా ఆందోళనలు కొనసాగకుండా, ఇరు పక్షాలూ ఓర్పుతో సౌజన్యంతో వర్తించగలిగితే, విచారణ సంఘపు కృషి ప్రయోజనకరమవుతుంది.

గ్రామోద్యోగులకు సంఘం లేనన్నాళ్లూ, సంఘీభావమే లోపించింది; సంఘం ఏర్పడిన తర్వాత వారి దోషాలు కూడా సంఘటితపడసాగాయి. గ్రామోద్యోగి ఎంత ప్రభుత్వోద్యోగి అయినా, రెవెన్యూ ఇన్‌స్పెక్టరు, తహసీల్దారు, డిప్యూటీ కలెక్టరు, కలెక్టరు, ఓవర్సీరు, సూపర్వైజరు, ఇంజనీరులలాంటి ప్రభుత్వోద్యోగి కాదు. గ్రామాలవట్ల పై ఉద్యోగులకు సాగుతున్న దృక్పథం, గ్రామోద్యోగులకు చెల్లుబాటుకాదు. ఆ ఉద్యోగులలాగా, గ్రామోద్యోగి కూడా గ్రామస్థులను తన క్రింది వారుగా చూసుకోలేడుకదా. గ్రామోద్యోగికి అలాటి దర్పం అధికారరీత్యా సంక్రమించలేదు.

విచారణ సంఘం ఈ విషయాన్ని గుర్తిస్తుందో లేదో చెప్పలేము. వారి విచారణ సమగ్రంగా ఉంటుందో లేదో ఇంకా తెలియదు. వారి నివేదిక గ్రామపరిపాలనను ఉద్ధరించడానికి తోడ్పడుతుందో లేదో, ప్రభుత్వం ముందుగానే చెప్తే మంచిది. గ్రామోద్యోగులు, తమకు ఒక సంఘం ఉంది కాబట్టీ, తాము గ్రామస్థుల ఆదరాభిమానాలపై నిత్యమూ ఆధారపడవలసిన వారు కాబట్టీ, విచారణ సంఘం వారి విచారణను విస్తృతం చేయించుకోనవచ్చు. అలాటి కృషి గ్రామోద్యోగుల సంఘానికి అనవసరమని తోస్తే, ప్రజాహిత సంస్థలు అందుకు పూనుకొనడం మేలు.

గ్రామోద్యోగులు వెట్టిచాకిరి చేయాలని ఎవ్వరూ అనరు. గ్రామోద్యోగులకు జరగవలసిన మేళ్లు జరగరాదని ఎవ్వరూ అనలేదు. పై అధికారులు గ్రామోద్యోగు అన్యాయం చేసినా, అది సర్వసామాన్యంగా గ్రామస్థులకు జరుగుతున్న అన్యాయాల్లో భాగమే. ఆ అధికార దుర్వినియోగంలో గ్రామోద్యోగులు కూడా భాగస్వాములు కారాదని మాత్రమే ప్రజాహితైషుల ఆకాంక్ష. ప్రభుత్వ వైఖరి మారాలని ఆందోళన చేసే గ్రామోద్యోగులు, తమలో అనేకులు నూతన చిహ్నాలు ఏకోశానైనా గోచరించినవేమో చూసుకొని ఉండవలసినది; ఆదర్శ ఫలితాలు కలుగకున్నా, ఆదర్శ కృషి అయినా జరిగి ఉండవలసినది. ఆ మేరకు గ్రామోద్యోగులు ప్రజానీకపు సానుభూతిని ఇంకా సంపాదించుకొనలేక పోయారనే చెప్పాలి. గ్రామోద్యోగుల మనస్తత్వం మారలేదని చూపడానికి, పై ఉద్యోగులు తమ దాష్టీకాలను ఇంకా కొనసాగించగలుగుతూ ఉండడమే నిదర్శనం.

గ్రామోద్యోగుల సమస్యను మొదటి ప్రణాళికా కాలంలోనే పరిష్కరించి ఉండవలసినది. అలా జరుగలేదు. ఈ సమస్యను పరిష్కరించాలనే సంకల్పం ఆందోళన ఫలితంగానే పుట్టినది అని తేలిపోయింది. అంతదాకా వేచుకొని ఉండగలిగిన మంత్రివర్గం ఒక ఆశ్చర్యకర బృందమే. ఇప్పటికైనా ఒక సంకల్పం కుదిరింది. సంతోషం.

దేశం అభివృద్ధి చెందాలి, అభివృద్ధి చెందాలి అనే హెచ్చరికను మంత్రులకంటే గట్టిగా చేయగలవారెవ్వరు! అభివృద్ధి చెందడానికి తగు మార్గాలను నిర్ణయించగలవారు, నిర్ణయింపజేయగలవారు, ఆ నిర్ణయాలను అమలుజరిపే అధికారం గల మంత్రులే. జపాను పద్ధతిలో వరిసాగు అయిన భూముల లెక్కలు వ్రాయకపోయినా, జమాబందీకోసం పట్నాల్లో రెండు మూడు రోజులు పడిగాపులు కాయకపోయినా, దేశాభివృద్ధికి లోటు రాదు. గ్రామాల సమస్యలను గ్రామోద్యోగుల ద్వారా తెలుసుకొనకపోవడం ఎందుకు కొనసాగాలో తెలియదు. వారి కలాటిపని ఇంతవరకూ ఎందువలన చెప్పలేదో! ప్రతిగ్రామానికీ ఉన్న ప్రాథమిక సమస్యలను. ఇంతవరకూ ఏ ఉద్యోగి మనస్సుకు పట్టించుకోలేదు. పొలానికి నీళ్లు రావడం లేదని ఓవర్సీరుచుట్టూ తిరగడం ఏమిటి ఈ అభివృద్ధి యుగంలో! గ్రామోద్యోగి వ్రాసిన తప్పు లెక్కలను సరిచేయించుకొనడానికి రెవెన్యూ ఇన్‌స్పెక్టరు, తహసీల్దారు, డిప్యూటీకలెక్టరుచుట్టూ తిరగడమేమిటి, గ్రామోద్యోగులలో ఇంత సత్ చైతన్యం కలిగినప్పుడూ, ప్రజా ప్రతినిధులు మంత్రులుగా ఉన్నప్పుడూ?

ఇంతవరకూ గ్రామోద్యోగి దగ్గరనుంచి రెవెన్యూ శాఖలో పైవారివరకూ, ఇది అభివృద్ధి యుగమనేనమ్మకంగానీ, తాము గ్రామాలను ఉద్ధరించడానికి పనిచేస్తున్న శాఖ అనేభావంగానీ, కలగనట్లే వ్యవహారాలు సాగుతున్నాయి. వీరిలో ఎవరిపట్ల ప్రజలసానుభూతి లేకపోయినా, అతప్పు ప్రజలది కాదు.

గ్రామోద్యోగులకు పనికి తగిన వేతనం ఎంత ఉండాలి? చెప్పడం కష్టం. అందువల్ల గ్రామజీవనానికి తగిన జీతమే చాలునందాము. పొలికలువద్దు. వాటిని లెక్కాక్టే సర్దుకు నేస్తోమతు గలవారు లేరు. కానీ గ్రామోద్యోగికి అభివృద్ధి కార్యక్రమాలలో శ్రద్ధకలిగించే అవకాశాలు వెదుకుతే, దొరుకుతాయి.

జనతాభీమా పథకంలో గ్రామోద్యోగులను కూడగట్టుకొనవచ్చు గదా. వరుమానం వచ్చే పనిని వారు చేయ ననరు. పైగా అది ఒక సద్వ్యాపారమే అవుతుంది. అది అభివృద్ధికార్యక్రమంలో గ్రామోద్యోగికి భాగస్వామ్యం కల్పించినట్లు అవుతుంది.

జమాబందీల కనీ, దొరగారు రమ్మంటున్నారనీ గ్రామోద్యోగిని తిప్పుతూ, ఏభత్యమూ ఇవ్వకుండా వ్యవహారాలు కొనసాగించాలనే ధోరణే ఇంత ఆందోళనకు దారితీసింది. రెవెన్యూమంత్రి హెచ్చరికను గ్రామోద్యోగులకే గాక, రెవెన్యూ ఉద్యోగులందరికీ చేసినట్లుంటే బాగుండేది. అప్పుడు ఇక జరగబోయే విచారణ సమగ్రంగా జరుగుతుందేమో నన్న ఆశ కలిగేది.

## నిజ్వా కోట నేలమట్టం

### ఓమాన్‌లో బ్రిటిష్ విమానాల ఘాతుకం

షార్జా, జూలై 25: ఓమాన్‌లో ఇమాం రాజధాని నిజ్వాపై బ్రిటిష్ రాయల్ విమానబలం తాలూకు నాల్గు వెనం జెట్ విమానాలు దాడిసాగించి, ఆ కోటను నేలమట్టం చేశాయి.

ఈ విమానాలు షార్జాలో వున్న బ్రిటిష్ స్థావరంలోంచి బయలుదేరి వెళ్ళాయి. దాడిలో రాకెట్‌లను, శతఘ్నులను ఉపయోగించాయి.

### బహ్రీన్నుంచి షార్జాకు సైన్యాలు

నిజ్వాకు ఉత్తరంగా 200 మైళ్ల దూరంలో ఈ షార్జా స్థావరం వుంది. బహ్రీన్ నుంచి ఇక్కడికి బ్రిటిష్ బలాలను కొన్నింటిని చేర్చారు.

### ఆరువేల గ్రామాలకు రాజు

నిజ్వాకోట మట్టి ఇటుకలతో కట్టిన కోట గోడలు 25 అడుగుల ఎత్తు వుంటాయి. బురుజులతో ఇతర ఏర్పాట్లతో ఇది, ఓమాన్ ప్రాంతంలోని 6 వేల గ్రామాలున్న రాజులాగా నిలబడి వుండేది. ఇక్కడ జబాల్ అఖ్దార్ అనే పర్వతం కూడా వుంది. ఇది అకుపచ్చని పర్వతం. అందుకే దానికి ఆపేరు వచ్చింది.

### నిన్న ఇజ్కికోట నేలమట్టం

నిన్న రాయల్ విమానబలం వెనం విమానాలు నిజ్వాకు 12 మైళ్లదూరంలో వున్న ఇజ్కి కోటమీద దాడిచేసి, దాన్ని నిర్ధూమధామం చేసివేశాయి.

### నిజ్వామీద 12 సార్లు

ఇవాళ్ల నిజ్వాకోట మీద ఈవిమానాలు 12 సార్లు దాడిచేసి, ఆకోటగోడలను, బురుజులను, రాకెట్‌లతో, శతఘ్నులతో నుగ్గు నుగ్గు చేశాయి.

### అంతా నిర్జనం

ఆకోటలోగాని ఆకోట చుట్టుప్రక్కలవున్న గ్రామాలలో గాని జనసంచారంవున్నట్లు కన్పించదని, విమానాలకు ఇంధనంకోసం, ఆయుధాలను పట్టుకవెళ్లడంకోసం వచ్చిన వైమానికులు చెబుతున్నారు. "ఆకోట, ఆ చుట్టుప్రక్కలవున్న ఖర్జూర తోటలు, నిజ్వాపట్టణం, అంతా నిర్మానుష్యంగావున్నది" అనివీరుఅంటున్నారు.

### ఫ్లైట్‌లెఫ్టినెంట్ కథనం

ఇవ్వాళ్ళఉదయం తెల్లవారబోతూ వుండగా జరిగిన మొదటిదాడినిగురించి ఫ్లైట్ లెఫ్టినెంట్ సైమ్ ఈలాచెప్పాడు: "నిజ్వాకోటమీద మొదటిదాడి స్థానిక సమయాన్నిబట్టి 7గం.45 ని. జరిగింది. మొదటవిమానాలు పట్టణంమీద నేలబారుగా ఎగిరాయి. వరిదాపుల్లో జనం వున్నారో, లేదో, పరిశీలించాయి. అప్పుడు 700 అడుగులు పైకిపోయి, కోటశిరస్సుమీద ఫిరంగుల ప్రేల్చాయి. ఇవ్వాళ్ళ ఈదాడులు పూర్తిఅయ్యేసరికి ఇమాం శ్వేతపతాకంక్రింద పడిపోతుందనుకుంటున్నాము. ఈదాడిలో మేము రాకెట్‌లను, 20 మిల్లీమీటర్ల శతఘ్నులను వాడుతున్నాము. అయితే ఈ దాడివల్ల ఆ కోటకు వాటిల్లిన నష్టం ఎటువంటిదో, ఫోటోలను పరిశీలించిగాని చెప్పలేము. అవి రాత్రికిగాని రావు. ఇక ఈ దాడి దాదాపు 20 నిమిషాలసేపు సాగింది. మామీద కాల్పులు సాగించిన ఆచూకీ ఏమీ క్రింద కన్పించలేదు."

### ఇజ్కికోటమీద వృద్ధస్త్రీ

ఫ్లైట్ లెఫ్టినెంట్ సైమ్, నిన్న ఇజ్కిమీద జరిగిన దాడిలో కూడా పాల్గొన్నాడు. ఆదాడినిగూర్చి ఆయన నేడు ఇట్లా చెప్పారు: మేము ఇజ్కికోటమీద దాడి చెయ్యడానికి పోయినప్పుడు, ఆకోటకొమ్మున ఒక వృద్ధస్త్రీ నిలబడివుంది. మేము ధ్వనిచేస్తూ అటూ ఇటూ ఎగిరాము. అప్పుడు ఆ వృద్ధురాలు అక్కడినుంచి వెళ్లిపోయింది. ఆతర్వాత మేము దాడి ప్రారంభించాము."

## కాశ్మీర్ వివాదం సమితి సర్వసభ్య సమావేశానికి నివేదన

### భద్రతా మండలిలో ప్రతిష్టంభన ఏర్పడితేనని పాక్ ప్రధాని ప్రకటన

న్యూయార్కు, జూలై 25: కాశ్మీరు గురించి భారతదేశంతో పాకిస్తాన్‌కు ఉన్న వివాదం విషయంలో భద్రతా మండలిలో ప్రతిష్టంభన ఏర్పడేపక్షంలో ఆవివాదాన్ని ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశానికి నివేదించడం జరుగుతుందని పాకిస్తాన్ ప్రధానమంత్రి శ్రీ హెచ్. ఎస్. సుహ్రావర్ది నేడు ఇక్కడ ప్రకటించారు.

పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రసంగిస్తూ, కాశ్మీరు వివాదం తిరిగి సెప్టెంబరు నెలలో భద్రతా మండలిలో చర్చకు రావచ్చునని శ్రీ సుహ్రావర్ది సూచించారు.

"ప్రతిష్టంభన ఏర్పడడం కాని, వీటో ప్రయోగించడంకాని జరుగదనే నేను ఆశిస్తున్నాను" అని ఆయన చెప్పారు.

"మా వాదం చాల సమంజసమైనది. ఆ కారణంచేతనే భద్రతామండలి సభ్యులు న్యాయంగా వ్యవహరిస్తారని మేము విశ్వసించగలుగుతున్నాము" అని శ్రీ సుహ్రావర్ది అన్నారు.

అయితే స్వీడన్ ప్రతినిధి శ్రీ గన్నర్ జారింగ్ ఈ సందర్భంలో ఈ ఏడాది ప్రారంభంలో భారతదేశమూ, పాకిస్తాన్ పర్యటించి సమర్పించిన నివేదికను భద్రతామండలి పరిశీలించే పర్యంతం కాశ్మీరు వివాదాన్ని సమితి సర్వసభ్యసమావేశానికి నివేదించడం గురించి మాట్లాడడం "అప్రస్తుతం" కావచ్చునని ఆయన అన్నారు. సమితి సర్వసభ్య సమావేశం సెప్టెంబరు 17 వ తేదీని ప్రారంభం కానున్నది.

పత్రికా ప్రతినిధులుమధ్యప్రాచ్యం గురించే ఎక్కువగా శ్రీ సుహ్రావర్దిని ప్రశ్నించారు.

### ఇజ్రేల్‌తో అరబ్ రాజ్యాల విభేదాలు

అరబ్ రాజ్యాలు ఇజ్రేల్‌తో తమకు ఉన్న విభేదాలు పరిష్కరించుకొనడానికి ప్రతిబంధకం కాగల కారణమేమీ తనకు గోచరించడం లేదని శ్రీ సుహ్రావర్ది చెప్పారు. "పాలస్తీనా సమస్య పరిష్కారంకావాలని ప్రతి ఒక్కరు కోరుతున్నారు. అరబ్ రాజ్యాలు కూడా దీనిని కోరుతున్నవనే నా అభిప్రాయం" అని ఆయన అన్నారు. అరబ్ రాజ్యాలు, ఇజ్రేల్ ముఖాముఖి రాయబారాలు సాగించడం సాధ్యంకాదని భావిస్తున్నట్లు, అరబ్ రాజ్యాలు కాని, పాకిస్తాన్ కాని ఇజ్రేల్ ఉనికి గుర్తించడంలేదని ఆయన చెప్పారు. ఈ విభేదాలు పరిష్కరించడానికి సమితి తగిన వ్యవస్థ అని పాక్ ప్రధాని అన్నారు. సమితి తీర్మానాలు ప్రాతిపదికగా ఈ వివాదం పరిష్కారం కావాలని, ఆ తీర్మానాలు అన్నిటిని పాకిస్తాన్ గుర్తిస్తున్నదని ఆయన చెప్పారు. ఇజ్రేల్ స్థాపన "ఒక పొరపాటు" అని కూడా ఆయన చెప్పారు. ఉభయ పక్షాల విశ్వాసం చూరగొనకుండా మధ్యవర్తిత్వం నెరపడానికి విదేశం ఆయినా ప్రయత్నిస్తే చేతులు కాల్చుకోనవలసి వస్తుందనికూడా పాక్ ప్రధాని చెప్పారు. ఇజ్రేల్ ఉనికి ప్రపంచంలో తీవ్రమైన పరిస్థితి ఏర్పడడానికి కారణమైనదని ఆయన అన్నారు.

### నదీజలాల సమస్య

సింధు నదీజలాల తగాయిదా పరిష్కారం కాగలదనే తాను ఏనాడూ ఆశిస్తున్నట్లు, ఉభయపక్షాల మధ్య సద్భావం ఉన్నట్లయితే పరిష్కారమార్గం లభించగలదని విశ్వసిస్తున్నట్లు శ్రీ సుహ్రావర్ది చెప్పారు. ప్రపంచ బాంకు కొన్ని ప్రతిపాదనలు చేసినది. పరిష్కారమార్గాలు సూచించినది. పాకిస్తాన్ వాటికి సమాధానం ఇచ్చినది. "ప్రపంచబాంకు లేఖకు భారతదేశం ఇంకా సమాధానం ఇచ్చినదో లేదో నాకు తెలియదు" అని ఆయనఅన్నారు.

### పత్రికా విలేఖరుల రాక

ఇప్పుడు ఇమాంమీద బ్రిటిష్‌వారు సాగిస్తున్న ఈ యుద్ధాన్ని గూర్చి వార్తలు పంపించడానికి 6గురు బ్రిటిష్ పత్రికా విలేఖరులు, ఒక అమెరికన్ విలేఖరి నేడు షార్జాలో దిగారు.

## ఇమాంతో సుల్తాను రాయబారం

### దారిలో దూత మరణం

కయిరో, జూలై 25: మస్కాట్ నవాబు శ్రీ తైమూర్, ఓమాన్ ఇమాంతో యుద్ధ విరమణ రాయబారాలకు దిగినమాట నిజమేనని, ఆ సుల్తాను శ్రీ అబ్దుల్లాచీన్ మెహాన అల్ ఎబ్రీని దూతగా పంపాడని, ఆ దూత; ఇమాంను కలుసుకొని తిరిగి వెళ్ళిపోతూ వున్నప్పుడు, దారిలో మందుపాటు ప్రమాదానికి గురియై మరణించాడని ఓమాన్ సమాచార సంస్థవారు ప్రకటిస్తున్నారు.

శ్రీ ఎబ్రీతో ఒక బ్రిటిష్ వైర్‌లెస్ ఉద్యోగి గూడా వచ్చాడు. ఈ మందుపాటు ప్రమాదంలో ఆయనకుగూడా దెబ్బలు తగిలాయి. వెంటనే బ్రిటిషు అధికారులు ఆ ఉద్యోగిని ఏడెన్‌లోని ఆస్పత్రికి పంపించారు అని ఈ సంస్థ అంటున్నది.

## ట్యునీషియాలో రాజరికానికి స్వస్తి

(1 వ పుట తరువాయి)

శ్రీ బోర్గుయిబా, రాజరికాన్ని ఎత్తివేసిన పద్ధతి నీరిని మరీ కంగారు పెడుతున్నది.

### ఉత్తరఆఫ్రికా నాయకత్వం కోసం పోటీ

ఇప్పుడు మొరాకో అధికారులు ఈ సంఘటనను గూర్చి ఏమీ వ్యాఖ్యానం చెయ్యకుండా వూరుకుంటున్నా, రాజకీయ వేత్తలు మాత్రం ఇట్లా అంటున్నారు: "ఉత్తర ఆఫ్రికాలో నాయకత్వంకోసం మొరాకో సుల్తాను, ట్యునీషియా ప్రధాని శ్రీ బోర్గుయిబా ఇద్దరు ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ తగాదాలో, ట్యునీషియా రాజరికం రద్దుకావడం ఒక ఎత్తు."

### ఫైజల్‌రాజు ఆసక్తి

కాగే, ఈ ట్యునీషియాలోని ఈ వ్యవహారాలలో ఇరాక్ రాజు ఫైజల్ కూడా కొంత ఆసక్తిని చూపుతున్న చిహ్నాలు కన్పిస్తున్నాయి. ఆయన ట్యునీషియా సుల్తానుకు ఒక ఉత్తరం వ్రాశారు. దాన్ని ట్యూనిస్‌లోని ఇరాక్ రాయబారి నిన్ననే, సుల్తానుకు అందజేశారు. అయితే అందులో ఫైజల్ రాజు ఏమి వ్రాశాడో తెలియదంలేదు.

## పాకిస్తాన్ దాడిచేస్తే

(1వ పుట తరువాయి)

ఈ సైన్యం, చరిత్రలో ఏ శకపు సైన్యమూ లేటివరకూ సాధించలేకపోయిన సత్కీర్తిని భారత సిపాయిలు తమ సద్వర్తన ద్వారా సాధించారు.

దేశరక్షణకు ఇంత ధనం వెచ్చించవలసి వస్తున్నందుకు విచారం ప్రకటిస్తూ, కోట్ల కొలదిగా విడిపోయిన నేటి ప్రపంచంలో ఇది అనివార్యం అని శ్రీ కృష్ణమీనన్ అన్నారు.

ఆయుధ కర్మాగారాలలో ఇటీవల రెండుమాసాలుగా ఉత్పత్తి ప్రమాణాలు నిర్ణయించుకుని పనివేగంగా సాగిస్తున్నారని శ్రీ మీనన్ చెప్పారు. ఆయుధాల విషయంలో భారత సైన్యం స్వయం సమృద్ధం కాక తప్పదు.

సైనిక వైమానిక బలాల ప్రాంతీయ అనుబంధ దళాలు చేస్తున్న పనిని శ్రీ మీనన్ మెచ్చుకున్నారు.

ప్రపంచంలో యుద్ధోద్వేగాలు చల్లారినప్పటికీ మన సరిహద్దులలోనూ ప్రమాదభీతి, వైర భావాలూ చల్లారగలవు.

భారతదేశం పారిశ్రామికంగా ఆర్థికంగా అభివృద్ధిచెంది, బలపడినప్పుడు తప్పకుండా చల్లారతాయి. అని శ్రీ మీనన్ అన్నారు.

ఏ రాజ్యానికిగాని దేశరక్షణ విధానం, విదేశాంగ ఆర్థిక సామాజిక పరిపాలనా విధానాలతో సంబంధంలేకుండా ఉండదు. లోక్‌సభలో చర్చ యుద్ధతత్వాన్ని రెచ్చగొట్టేదయితే అది దురదృష్టం అనుకోవాలి.

మనం భీతికిలోబడి వైరిగా ప్రవర్తించడం లేదు. స్వతంత్ర రాజ్యాలు చూపవలసిన వివేకం వివక్షణం భారత ప్రభుత్వం చూపుతున్నది.

అయితే ఏ రాజ్యకూటంలోనూ చేరనందువల్ల మనం మన సరిహద్దుల సంరక్షణ విషయంలో మన బలంపైనే ఆధారపడాలి. ప్రపంచానికి మనస్సు విరిచి దురాక్రమణపరుని నిరోధించే వరకూ, ఇలా మనం మన బలంపైనే ఆధారపడాలి అని శ్రీ మీనన్అన్నారు.

## రాష్ట్రాల పోలీసులకు స్కంధావారాలు

న్యూఢిల్లీ, జూలై 25: కేంద్ర ప్రభుత్వం తమ అధికారంలో స్కంధావారాలు (కంటోన్మెంటులు) నెలకొల్పినట్లే రాష్ట్ర ప్రభుత్వాలు కొన్ని తమ పోలీసు బలాలకు "స్కంధావారాలు" నెలకొల్పాలనే ఆలోచనలో ఉన్నాయని, దేశరక్షణమంత్రి శ్రీ కృష్ణమీనన్ ఇవాళలోక్‌సభలో తెలిపారు.

కేంద్రప్రభుత్వానికి కంటోన్మెంటులను తమ "సైనిక సామ్రాజ్యాలు" గా రూపొందించాలనే కోరిక లేదన్నారు. ఇటీవల కొన్ని కంటోన్మెంటుల పాలక సంఘాలలో సగం స్థానాలలో పౌరులను నియమించి చూస్తున్నారు. అయితే వీనిని పూర్తిగా పురపాలక సంస్థలకు అప్పగించడం మాత్రం సాధ్యపడదని శ్రీ మీనన్ స్పష్టపరిచారు.

## ముఖ్యమంత్రికి వార్త

(1 వ పుట తరువాయి)

కూడా ఉన్నది. ఈ సంగతి ప్రభుత్వం ఆలోచించింది. ఇప్పుడున్న సంస్థ అధీనంలోనే యాజమాన్యం ఉంచి ప్రత్యేకోద్యోగి ఒకరిని నియమించి కార్యకలాపాలను నడపడం సమంజసమని భావించాము."

"బోధన్ చక్కెర ఫ్యాక్టరీకి చెందిన 16 వేల ఎకరాలలో చెరుకు పండుతుంది. చుట్టుప్రక్కల పొలాల్లో చిన్న చిన్న రైతుల ఖర్చులకంటే ఈ ఫ్యాక్టరీకి చెరుకు పండించేందుకు ఎక్కువ ఖర్చు వుతోంది. భారీఎత్తున ఉత్పత్తిచేసేప్పుడు మరి ఖర్చు తగ్గాలి. ఖర్చుఎక్కువ కావడానికిగల కారణాలను పరిశీలించగా పర్యవేక్షణలో ఎక్కువఖర్చువుతోందని తెలిసింది."

### సింగరేణి గనులు

"సింగరేణి బొగ్గుగనులలో ఉత్పత్తి బాగా పెరిగింది. ఈగనులు ప్రభుత్వ యాజమాన్యంలోనే ఉన్నవి. ఆ గనుల వ్యవహారాలనుచూస్తున్న ఉద్యోగి గనుల ఇష్టమైనప్పుడు మూడు నెలలు ముందుగా చెప్పి తీసివెయ్యవచ్చు. ఈగనులలోకూడా ఉత్పత్తిఖర్చు ఎక్కువగానే ఉన్నది. తీసేయుసుంచి నష్టం అయ్యే బొగ్గుకే సింగరేణి గనులలోని బొగ్గుకుకూడా పడుతోంది. ఈగనులలో ఇప్పుడు తయారవుతున్న కోక్కును రెట్టింపు బొగ్గును తయారుచేయవచ్చు. అందుకు డబ్బు ఇవ్వడానికి కేంద్ర ప్రభుత్వం దాదాపు అంగీకరించినట్లే — ఈ సంవత్సరం రు 65 లక్షలు కావలసి ఉంటుందని ఢిల్లీకి వ్రాశాము. వరికరాలకు వెంటనే రు 10 లక్షలు కావాలని రాస్తే వెంటనే ఇచ్చారు. ఈ విధంగా రు 10 లక్షలు ఇవ్వడంవల్ల మిగతా డబ్బుకూడా ఇవ్వడానికి కేంద్రప్రభుత్వం మాట ఇచ్చినట్లే నన్నమాట."

### సందిగ్ధావస్థ

"ఆల్విన్ మెటల్ వర్క్సువంటి సంస్థలలో వాటాలనే కాక, అప్పుడుగా ఇచ్చిన మొత్తాలనుకూడా ప్రభుత్వం కోల్పోవలసి వచ్చేటుంది. ఈ పరిస్థితినుంచి బయటపడేందుకు రెండు మార్గాలున్నవి. ఒకటి— మన వాటాలను ఉపసంహరించుకోవడం. ఇప్పటి పరిస్థితులలో ఈ వాటాలను కొనేందుకు ఎవరూ రారు. వాటా కిమ్మతును (ధర) తగ్గిస్తే.పూర్తిగా తగ్గిస్తే ఎవరైనా కొనవచ్చు. రెండవది—యాజమాన్యాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొని కొన్ని లక్షలను దానిమీద ఖర్చుపెట్టడం. ఇది పూర్తిగా మనదికాదు. ఈపరిస్థితులలో వాటిమీద మరికొన్ని లక్షల రూపాయలు వెచ్చించడం వ్యాపారదృష్ట్యా మంచిదా అన్నదొక ప్రశ్న. ఈ సందిగ్ధావస్థలో పడి ఇంతవరకూ నిర్ణయమేమీ చెయ్యలేదు."

"సిర్‌సిల్క్, సిర్పూరుల సంగతి— ఇప్పుడిప్పుడే అప్పులో కొంచెం, కొంచెం వస్తోంది. ఈ సంస్థ ఇప్పుడు బిర్లాల చేతులలో వున్నది. ప్రభుత్వం ఇచ్చిన అప్పులో ముప్పై, నలభై లక్షల దాకా తిరిగి వచ్చింది. వీటిలో ప్రభుత్వానికి ఎక్కువ వాటాలు లేవు-బిర్లాకు కూడా లేవు. అందుకనే వాళ్ళు పెట్టుబడి పెట్టలేదు."

### మూడు రకాలు

"మన పరిశ్రమలను మూడు రకాలుగ చెప్పుకోవచ్చు. ప్రభుత్వానికి ఎక్కువ వాటాలున్న పరిశ్రమలు మొదటిరకం. సింగరేణి గనులూ, బోధన్ చక్కెర ఫ్యాక్టరీ, ప్రాగాటూల్స్ కార్పొరేషన్ వంటివి. ప్రభుత్వానికి కొన్ని వాటాలుండి-ఇరవై ముప్పైలక్షలదాకా ప్రభుత్వం అప్పు ఇచ్చిన పరిశ్రమలు రెండవరకం. ఆల్విన్ మెటల్ వర్క్స్, సిర్పూరు, సిర్ సిల్క్ - ఇటువంటివి. ప్రభుత్వానికి వాటాలేమీ లేకుండానే ప్రభుత్వం అప్పులు ఇచ్చిన సంస్థలు కొన్ని ఉన్నవి. ఇటువంటి సంస్థలకు రెండుమూడు లక్షలదాకా ప్రభుత్వం అప్పు ఇచ్చింది. ఈ అప్పు డబ్బు దాదాపు పోయినట్లే మనం చెప్పుకోవచ్చు. వాటిసంగతి ఇంకా నేను ఆలోచించలేదు. ప్రభుత్వానికి ఎక్కువ వాటాలున్న పరిశ్రమల సంగతే మొదట ఆలోచించడం మంచిదని నేను అనుకొన్నాను. నానాక నిర్ణయానికివచ్చిన తరువాత మంత్రివర్గానికి ఆ సంగతి తెలియజేస్తాను. అప్పుడు ఏదో ఒక నిర్ణయం జరుగుతుంది."

### భారీపరిశ్రమలు లేవు

"అన్ని రాష్ట్రాలలోనూ ఏదో పరిశ్రమలున్నవి. మన రాష్ట్రంలోనే భారీపరిశ్రమ యేదీ లేదనే విచారం నాకు ఉన్నది. ఢిల్లీకి రాశాము. అక్కడినుంచి శ్రీ షా వచ్చారు. తనతో పాటు కార్యదర్శులనుకూడా తీసుకువచ్చారు. ఈ సంగతి వారితో సంప్రదించాము."

"న్యూస్ ప్రింట్ ఫ్యాక్టరీని ఏర్పాటుచేసేందుకు బోధన్‌లో చాలా అవకాశాలున్నవి. సాధారణంగా న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీకి కావలసిన ముడి వస్తువులను ఇరవై ముప్పై మైళ్ళనుంచి తీసుకురావలసి ఉంటుంది."

"రాజమండ్రి కాగితాల మిల్లుదగ్గరికి మిల్లుకు అవసరమైన వెదురు వాసాలు తీసుకురావడానికి టన్నుకు రు. 200 అవుతుంది. బోధన్ ఫ్యాక్టరీలో చక్కెర తయారుచేయగా మిగిలే పిప్పిని న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీకి ఉపయోగించవచ్చు. బోధనలో న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీ నెలకొల్పడానికి కావలసిన సౌకర్యాలన్నీ ఉన్నవని వారు అంగీకరించారు. న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీకి చక్కెర ఫ్యాక్టరీ చేత రు 1 కోటి పెట్టుబడి పెట్టిస్తే బాగుంటుందని వారు సూచించారు. రు 1 కోటి పెట్టుబడి పెట్టించడం ఇప్పట్లో సాధ్యం కాదని వారికి తెలియచేశాము. ఆ పిప్పిని ఈ న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీకి ఇస్తే దానికి బదులు బొగ్గును చక్కెర ఫ్యాక్టరీ వాడవలసి వస్తుంది."

"ప్రస్తుతం చక్కెర ఫ్యాక్టరీ చేత రు 25 లక్షల రొక్కం పెట్టుబడి పెట్టించి, చక్కెర ఫ్యాక్టరీ సప్లయిచేసే పిప్పి ధరలోనుంచి బొగ్గు ధరను మినహాయించి, మిగతా మొత్తాన్ని రు 1 కోటి పెట్టుబడిగా జమకట్టుకుంటే (క్రమంగా) బాగుంటుందని మేము సూచించాము. వారు కూడా అందుకు అంగీకరించారు."

### ఎరువుల ఫ్యాక్టరీ

"ఎరువుల ఫ్యాక్టరీ ఒకటి ఈ ప్రాంతంలో ఏర్పాటు చేస్తే బాగుంటుందని భార్య హైదరాబాదు, ఆంధ్ర ప్రభుత్వాలు రెండూ సూచించినవి - ఒత్తిడి చేసినవి. విజయవాడలో కాని, కొత్తగూడెంలో కాని ఈ ఫ్యాక్టరీని ఏర్పాటుచెయ్యవలసినదిగా అడిగాము. కొత్తగూడెంలో ఏర్పాటుచేస్తే మాకు అభ్యంతరమేమీ లేదనిగోపాలరెడ్డిమంత్రివర్గం తెలియచేసిందికూడా. ఎరువుల ఫ్యాక్టరీకి మనరాష్ట్రంలో మంచి గిరాకీ ఉన్నది. ఏర్పాటుచేస్తే బాగుండేది మరి. కానీ, విజయవాడలోనూ ఏర్పాటు చెయ్యలేదు, కొత్తగూడెంలోనూ ఏర్పాటు చెయ్యలేదు. చిన్న చిన్న కారణాలవేవో చెప్పి మిగతా రాష్ట్రాలలో ఏర్పాటుచేశారు. ఎరువుల ఫ్యాక్టరీ పెడతామని వ్యాపారస్థులు ఎవరైనా అంటే అందుకు కావలసిన అనుమతి తెప్పించేందుకు రాష్ట్రప్రభుత్వంప్రయత్నిస్తుంది."

"తెలంగాణాలో మంచి మంచి పరిశ్రమలను ఏర్పాటుచేశారు. సదుద్దేశంతోనే ఏర్పాటు చేశారనడంలో సందేహంలేదు. అయినా, ఏదయిన వర్యవేక్షణ లేకపోవడంవల్లనో, సమయిన వారి చేతులలో లేకపోవడంవల్లనో అవి చెడిపోయినవి. విచారపడటం కంటే మనం చేసేదేమీ లేదు. బాగుచేసుకోవడానికి ప్రయత్నిద్దాము. మరో పది పరిశ్రమలను ఏర్పాటుచేయడం కంటే ఉన్న పరిశ్రమలను బాగు చేసుకోడం మంచిది."

"కోడూరవాణా విషయంలో హైదరాబాదు మునందంజ వేసింది. మరి ఏ రాష్ట్రమూ చెయ్యకముందే రోడ్డు రవాణాను జాతీయంచేసి, రైళ్ళనూ, బస్సులనూ ఒకేఒక సంస్థ అధీనంలో సమర్థనీయంగా నిర్వహిస్తున్నారు అని అనిపించుకున్నారు. మొదట దీనిని రైల్వేనుంచి విడతీశారుగానీ అందువల్ల వచ్చిన ఖర్చులు అట్లాగే ఉండిపోయినవి. ఒక్క మదరాసు నగరంలోనే రు 20 లక్షలు వస్తున్నప్పుడు ఇక్కడ తెలంగాణా కంతకీ కలిపి ఆరేడు లక్షల లాభంరావడమేమిటి? నేనూ ఇదే అనుకున్నాను. ఇంకా బాగా పరిశీలించలేదు. స్థూలంగా పరిశీలిస్తే ఇక్కడ డ్రైవర్లకూ కండక్టర్లకూ జీతాలు ఎక్కువ. పోశరాల్యలుకూడా ఎక్కువే. జీతభత్యాల సంగతేకాక పోశరాల్యలు కూడా ఎక్కువే. ఒక్క డ్రైవర్లూ, కండక్టర్ల సంగతే కాదు. పైనుంచి కింది దాకా అంతే-అయినా ఈ మాత్రానికి ఇంత లేజా రావాలాకీ నమూధాన సంతృప్తిగా లేదని అనుకొంటున్నా."

"కోడ్డురవాణాను ఆంధ్ర ప్రాంతానికి కూడా విస్తృతం చెయ్యాలని మిత్రులు అంటున్నారు. ఇక్కడ రవాణాను అభివృద్ధి చెయ్యడానికి డబ్బు కావాలని అడిగితే అంగీకరిస్తూనే కేంద్రం ప్రభుత్వం కొన్ని మరతులు పెట్టింది. రోడ్డు రవాణాను ఒక 'కార్పొరేషన్' నిర్వహణలోకి తీసుకురావా లన్నారు. అప్పటి ప్రభుత్వం అందుకు అంగీకరించలేదు. ఇటువంటి 'కార్పొరేషన్'ను ఆంధ్ర ప్రాంతంలో ఏర్పాటు చేస్తే బాగానే ఉంటుందనుకొంటాము. కానీ, ప్రభుత్వం తీసుకున్నా లేకపోతే కార్పొరేషన్ తీసుకున్నా "మార్గాల అనుమతులనూ" (రూట్లు), బస్సులకూ లక్షలాది రూపాయలు పరిహారంగా ఇవ్వవలసి వస్తుంది. 'రూట్లను' తీసుకొంటామే గాని బస్సులు మాత్రం వద్దు అని అనగలమా? ఆంధ్రప్రాంతం అంతటికీ కలిసి రు 3కోట్లు అయినా ఖర్చుపెట్టవలసి ఉంటుంది. కొన్ని మార్గాలకూ, కొన్ని జిల్లాలకూ రోడ్డు రవాణాను విస్తృతం చేసే సంగతిని ఆలోచించాలి. ఉదాహరణకు బందరు - హైదరాబాదు మార్గం సంగతి ఆలోచించవచ్చు. అంతా గందరగోళంగా ఉన్నది - నిర్ణయం చేయడం కాదు. ఏదైనా చెరువు తవ్వించడం వంటి సంగతయితే ఒక నిర్ణయం చేయవచ్చు. చూడకుండా సంతకం పెడితే అదీ ఒక నిర్ణయమే అవుతుంది. ఆలోచించి ఒక నిర్ణయానికి రావలసి ఉంటుంది. అందువల్లనే ఆస్‌బెస్టాస్ వంటిసంస్థల విషయములో కూడా నిర్ణయం చేయలేదు."

### ఎవరిని వెయ్యాలి?

"బోధన్‌లో ఒక అధికారిని నియమించాలి. ఎవరిని నియమించాలి? ఉపకారవేతనం తీసుకుంటున్న కలెక్టరునా? లేక ఎవరయినా ఒక వ్యాపారస్థుణ్ణి నియమించటమా?— ఎవరైనా సరే - కొంత అనుభవం ఉన్న వాడినే నియమించాలి. ఏదో ఒక నిర్ణయానికి ప్రభుత్వం రావాలి."

### తీసుకున్న తరువాత....

"ఆ సంస్థలనుతీసుకోవాలి అంటారు. తీసుకున్న తరువాత ఏమి చెయ్యాలి! ఏదో ఒక నిర్ణయానికి రాలేక పోతున్నాను. ఆలోచించి ఏదో ఒక నిర్ణయానికి వస్తాను. మీరుకూడా సూచనలు చెయ్యండి. నిర్మాణాత్మకంగా ఉండే సూచనలు చెయ్యండి."

"కార్మిక స్థితిగతులు బాగాలేవనీ, ప్రభుత్వ యాజమాన్యములోని సంస్థలలో కూడా జీతభత్యాలు బాగాలేవనీ తెలిసింది. ఈ సంగతి నాతో శ్రీ సంజీవయ్య మాట్లాడారు. వారు సంబంధం ఉన్న సంగతి కాకపోయినా చెబుతున్నాను. ఇది న్యాయం కాదని చెప్పాను. సరిఅయిన పరిస్థితులు ఏర్పాటు ప్రయత్నిస్తాను."

"రాజమండ్రి కాగితాల మిల్లుకు ఈ సంవత్సరం మాత్రమే లాభం వచ్చింది. లాభం లెక్కకట్టేప్పుడు ఇదివరకు వచ్చిన నష్టాన్ని మినహాయించాలి. అట్లా మినహాయిస్తే నాలుగు లక్షలు బోనసు కంటే ఎక్కువ కార్మికులకు రాదు. అయినా సాంకేతిక వ్యవహారాలను అట్లా ఉంచి లాభం వచ్చినందుకు మన సంతోషం తెలియజేస్తూ కార్మికులకు ఒకనెల వేతనం బోనసుగా ఇవ్వవలసినదిగా ఆదేశించాము."

"రు 6 అదనపు కరువుభత్యం సంగతి శ్రీ సంజీవయ్య నిన్న చెప్పారు. ఇవ్వాలనే అనుకున్నాం. తెలంగాణోద్యోగులకు ఇచ్చిన రు 6 అదనపు కరువుభత్యంలో సూడ వంతు రాష్ట్ర ప్రభుత్వం భరించింది. అయినా అరవై లక్షలదాకా అయింది. అయినా ఇవ్వాలనే అనుకున్నాం. అంతలో పరిశ్రమలలోని కార్మికులకు ఈ రు 6 అదనపు కరువుభత్యం పొసగకుండా వర్తించదని కేంద్ర ప్రభుత్వందగ్గర నుంచి తంతి వచ్చింది. కార్మికులకు ఇవ్వాలనే కోరిక మాకూ ఉన్నది. ఇవ్వాలనే ఆశ ఉన్నది— కానీ,ఇవ్వలేకపోతున్నాం."

"సాధ్యమైనంతవరకూ మీ సలహాలను అంగీకరిస్తానని చెప్పాను. అన్నింటినీ పరిశీలిస్తాను. కొల్లాది రూపాయలయ్యే సలహాలు ఇవ్వకండి. ఆచరణ సాధ్యమైన సలహాలు చెప్పండి."

## భారత ద్రవ్యం దొంగరవాణా

### ఇద్దరు విదేశీయులకు రు 25 లక్షలు జరిమానా

న్యూఢిల్లీ, జూలై 25: దొంగచాటుగా బంగారం తీసుకువచ్చి, కొంతబంగారు బిస్కెట్లు అనే యూదుజాతీయునికి అదిరు 63 లక్షల భారత ద్రవ్యాన్ని, 10 వేల అమెరికన్ డాలర్లను చాటుగా దేశంనుంచి తీసుకుపోవడానికి ప్రయత్నించిన నేరానికి లియోరాయ్‌ఫ్రే అనే ఒక అమెరికన్ స్టాక్‌బ్రోకర్‌కీ, థామస్ బాషా అనే విదేశీయునికీ నిన్న ఢిల్లీ కస్టమ్స్ కలెక్టరు రు 25 లక్షలు జరిమానా విధించారు. బాషా బ్రసెల్స్‌లోని కువైట్ రాయబారివద్ద కార్యదర్శిగా పనిచేస్తున్నాడట.

వీరిద్దరూ ఒక అమెరికన్ కారులో జూన్ 23 న అమృత్‌సర్ నుంచి పాకిస్తాన్‌కు ధనంతో వెళ్లిపోతూఉండగా పోలీసులు పట్టుకున్నారు.

వీరివద్ద దట్ట విరుద్ధంగా బంగారం కొన్న బిస్కెట్లుకూడా బొంబాయిలో పోలీసులు పట్టుకుని అమృత్‌సర్ తీసుకువచ్చి నిర్బంధంలో ఉంచారు.

ఇదివరలో బిస్కెట్ల దొంగరవాణా నేరాలకు బొంబాయిలో రు 6 లక్షలు జరిమానా విధించి ఉన్నారు.

వీరి ముగ్గురిపైనా పోలీసులుకూడా అభియోగం తీసుకు రానున్నారని తెలుస్తున్నది.

ఫ్రే, బాషాలు ఇద్దరూ బొంబాయిలో తమ అమెరికన్ కారులో వెనుక సీటుక్రింద రహస్య స్థలంలో ద్రవ్యం దాచిపెట్టి, కారుని ఢిల్లీకి రప్పించుకొనడానికి బొంబాయిలో పడవుల రైలు ఎక్కించారట. తరువాత ఇద్దరూ విమానంలో బొంబాయినుంచి ఢిల్లీ వచ్చారు. కారుపైన రాయబారి ఉద్యోగికి చెందినది సూచించే "సి. డి." అనే అక్షరాలపలక తగిలించి ఉంది.

ఈ కారు ప్రయాణంచేస్తున్న రైలు మధుర, ఢిల్లీ స్టేషన్లమధ్య కోసీకలాన్ వద్ద చిన్నప్రమాదానికి గురై, ఢిల్లీ రావడంలో కొంత ఆలస్యం అయింది. దానితో విదేశీయులు ఇద్దరూ కంగారు పడిపోవడం ప్రారంభించారు. అది గమనించి రవాణా సుంకశాఖాధికారులు అనుమానించారు.

కారు ఢిల్లీలో దిగగానే, వారిద్దరూ అందులో అమృత్‌సర్‌కు బయలుదేరారు. దాన్ని మార్గంలో రవాణా సుంకశాఖ అధికారులు పట్టుకున్నారు.

కారులో డబ్బుకోసం వీరు ఎంత వెతికినా కనపడలేదట. అమృత్‌సర్‌లో ప్రభుత్వపు కర్మాగారంలో గాలించిచూశారు; కాని వెనక సీటు కింద రహస్యపుగది కనపడలేదు.

ఎనిమిదిరోజులు గాలించి గాలించి, విదేశీయులిద్దరినీ ప్రశ్నలువేసి విసిగించి చివరికి ఆగది కనిపెట్టి అందులో ద్రవ్యం పట్టుకున్నారు.

## అల్జీరియన్లు ముగ్గురి ఉరి

అల్జీర్స్, జూలై 25: హత్యా నేరానికి ఒకనిని, హత్యాప్రయత్న నేరానికి ఇద్దరిని అల్జీరియా జాతీయ వాదులను ఇవాళ తెల్లవారే సమయాన అల్జీర్స్ కారాగారంలో ఉరితీశారు.

## సైనికోద్యోగుల పేటలో రాష్ట్రపతికి స్వాగతం

హైదరాబాదు, జూలై 25: రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాద్ ఈరోజున సైనికోద్యోగుల పేటను సందర్శించారు.

సైనికులు మంగళవాద్యాలతో ఆయనను స్వాగతం చెప్పారు. పేట అంతా తోరణాలతో చక్కగా అలంకరించారు.

# వీటో వల్లనే సమితికి రక్షణ

## రద్దుకు భారతదేశ ప్రాతికూల్యం

### ధర్మకర్తృత్వంపట్ల తీవ్ర అసంతృప్తి

న్యూయార్కు, జూలై 24: భద్రతా మండలిలో వీటో అధికారం రద్దుపరచడానికిగాని, సమితి నియమావళికి ప్రాతిపదిక అయిన మూలసిద్ధాంతాలను మార్చడానికిగాని భారత ప్రభుత్వంకాని, భారతదేశ ప్రజలుకాని సమ్మతించరని ఒక పరిశోధనవల్ల తెలుస్తున్నది.

అంతర్జాతీయ శాంతికోసం ఏర్పడిన కార్నెగీ సంస్థ కోరిక ననుసరించి, ప్రపంచ వ్యవహార భారతీయమండలి, ఐక్యరాజ్యసమితిని గురించి భారతదేశంలోకల అభిప్రాయాలను పరిశోధించి తయారుచేసిన నివేదికలో పై విషయం తెలియవచ్చింది.

ఐక్యరాజ్య సమితిని ప్రపంచ ప్రభుత్వంవంటి సంస్థగా రూపొందించడానికి భారతీయులు పూర్తిగా విముఖులు సమితిని ఆవిధంగా రూపొందించే పక్షంలో, అది ఏదో ఒక అగ్రరాజ్యం చేతిలోనో లేక ఒక రాజ్యవర్గం ప్రాబల్యానికో లోబడిపోయి, ఆ అగ్రరాజ్యం లేదా ఆ రాజ్యవర్గం అవసరాలను తీర్చే సాధనంగా పరిణమిస్తుందని భారతీయుల అభిప్రాయం.

సమితి ఇప్పటికే ఈ మాదిరిగా పరిణమించకుండా కాపాడినది అగ్రరాజ్యాల వీటో అధికారం. అందువల్లనే అగ్రరాజ్యాలవీటో అధికారం రద్దుచెయ్యాలనే ప్రతిపాదనను భారతదేశం ప్రతిఘటిస్తున్నది.

వీటోవల్ల సమితి తరచు అశక్తతో ఉండిపోవలసి వస్తున్నమాట నిజమే. కాని ఏదో ఒకవర్గం పెత్తనానికి లోబడిపోవడం కంటె అదేమేలు.

పరాయి పరిపాలనలో ఉన్న దేశాల విషయంలో సమితి చేసిన కొన్ని చర్యలకు భారతదేశం పూర్తిగా ఆశాభంగం పొందింది. సమితి ధర్మకర్తృత్వంలో ఉన్న దేశాల పరిపాలనపై అజమాయిషీ విషయంలో సమితి తన బాధ్యతలను పూర్తిగా నిర్వహించలేక పోతున్నందుకు భారతదేశం చాలా అసంతృప్తి చెందింది.

న్యాయ నియమాల విషయంలో కూడా ప్రధానమైన మార్పు లేవీ భారతదేశానికి ఇష్టంకావు. కాశ్మీరు వివాదంలో పరిష్కర్తృత్వానికి భారతదేశం సమ్మతించలేదు. అంతర్జాతీయ నేర విచారణస్థానం స్థాపనకు కూడా భారతదేశం సుముఖంగా లేదు.

అంతర్జాతీయ బాధ్యతలు హెచ్చడం అంటూ వస్తే, భారతదేశం తన స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకోడం ప్రధానంగా ఎంచి, కొంత అప్రమత్తతతో వ్యవహరించేమాట నిజం.

స్వపరిపాలనలేని రాజ్యాల విషయంలో కొంతమేరకు ధర్మకర్తృత్వసంఘం వంటిది ఒకటి కొత్తది ఏర్పడాలని భారతీయుల అభిప్రాయం.

ఈ నివేదికను తయారు చెయ్యడానికి తోడ్పడినవారిలో ఎటార్నీ జనరల్ శ్రీ యం. సి. సెటాల్వాడ్, ప్రొఫెసర్ డి. ఆర్. గాడ్గిల్, ప్రొఫెసర్ మహమదు హాబీబ్, డా॥ ఏ. అప్పాదొరై వున్నారు.

# ప్రపంచ శాంతి స్థాపించింది

## అమెరికాపై సురావర్దీ స్తుతి పాఠం

న్యూయార్కు, జూలై 24: అమెరికా ప్రజాస్వామ్యాన్ని వ్యాపింపచెయ్యడమే కాదు, ప్రపంచంలో శాంతిని నెలకొల్పింది, అంటూ పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్దీ, ఇవాళ వాల్డోర్ఫ్-ఆస్టోరియాలో పురపాలక సంఘం ఇచ్చిన విందుసందర్భంలో ప్రశంసించారు.

ప్రపంచ శాంతిని రక్షించడానికి ఐక్యరాజ్యసమితి ఒక్కటే సాధనం; అందువల్ల ఆ సంస్థ అధికారాన్ని, ప్రతిష్ఠను పెంచడానికి చర్యలు తీసుకోవడం అవసరం, అని శ్రీ సురావర్దీ అన్నారు.

అసమితి ఆ దేశాలను ధిక్కరించే రాజ్యాలపై ఆంక్షలు విధించ చేసినట్లయితే యుద్ధనివారణ ఒకమెట్టు సాధించినట్లే; దుర్బలదేశాలకు పొరుగునఉండే బలవంతమైన రాజ్యాల తంత్రాలనుండి కాపాడుకోవడానికి సమితి ఒక్కటే శరణ్యం.

దుర్బల రాజ్యాలను ఎల్లప్పుడూ బలపరిచే అమెరికాను శ్రీ సురావర్దీ ప్రశంసించారు.

అణుబాంబుల రహస్యం అమెరికా ఒక్క రాజ్యానికి మాత్రమే తెలిసిన రోజుల్లో, అది ప్రయోగించి ప్రపంచాధిపత్యం సంపాదించడానికి బదులు, శాంతిని సంరక్షించడానికి మాత్రమే అది వినియోగపరచగలదని ప్రకటించింది.

ప్రపంచంలో ప్రజాస్వామ్యాన్ని వ్యాపింప చెయ్యడమే కాకుండా, శాంతిని నెలకొల్పిన అమెరికావంటి దేశం, ఆర్థిక సహాయంచేస్తే అది సామ్రాజ్య వ్యాపక తత్వం అని విమర్శలు వినరావడం ఆశ్చర్యకరం, అని శ్రీ సురావర్దీ అన్నారు.

ఆంగ్లో-అమెరికన్ రాజ్యాలు అధికార ప్రాబల్యం తగ్గిపోతూవుంటే, కొత్తరకం సామ్రాజ్యతత్వం బలపడుతున్నదని వారు హెచ్చరించారు.

చైనా రష్యాలవంటి రాజ్యాలు పొరుగులో ఉంటున్నా కూడా, పాకిస్తాన్ స్వేచ్ఛా సంరక్షణకోసం చేస్తున్న కృషికి స్వేచ్ఛా ప్రపంచం అంతా కృతజ్ఞతతో ఉన్నదని, శ్రీ సురావర్దీని సన్మానించిన శ్రీ వాంగర్ అన్నారు.

# ఆల్జీరియా స్వపరిపాలన

## ఫ్రాన్సు సహాయంతో ఏర్పాటు చేస్తారట

పారిస్, జూలై 23: తమ ఆంతరంగిక వ్యవహారాలను ఫ్రాన్సు సహాయంతోను ఫ్రాన్సు మధ్యవర్తిత్వంతోను నిర్వహించుకోనడానికి ఆల్జీరియా ప్రజలకు అవకాశం ఇచ్చే బిల్లును వచ్చే పార్లమెంటులో ప్రవేశపెట్టనున్నట్లు బ్రిటిషు, అమెరికన్ పత్రికా ప్రతినిధుల సంఘ సమావేశంలో మాట్లాడుతూ ఫ్రెంచి ప్రధాని మనోరీ బౌర్గెస్ చెప్పారు. ఆల్జీరియా సమస్య పరిష్కారానికి అద్భుతమైన సిద్ధాంతం ఏమీ లేదనీ, ఉభయజాతులలోను పరస్పర విశ్వాసం ఉండాలనీ అన్నారు. ఉభయపక్షాలు ఫ్రాన్సు శాశ్వత మధ్యవర్తిత్వానికి అంగీకరించాలనీ ఇలాంటి సహకారాన్ని పెంపొందించే బిల్లును వచ్చే పార్లమెంటులో ప్రవేశపెడుతున్నామనీ అన్నారు. ఈ బిల్లు ఫలితంగా ఏర్పడే రాజకీయ వ్యవస్థలో సుహృద్భావం గలవారికి అవకాశం ఉంటుందన్నారు. నిజంగా శాంతినే కాంక్షిస్తే, తమను సంశయించరాదనీ, రాజకీయ లక్ష్యాలు లేకుండా, కేవలం హత్యదోపిడీలపైనే నమ్మకంగల జాతీయ విమోచనోద్యమ నాయకుల ప్రతిపాదనలను పరిశీలించ నేరాదనీ అన్నారు. చిత్రవధ, అల్లకల్లోలం దారిద్ర్యం కలుగచేసే హక్కుతో స్వాతంత్ర్య హక్కును మేళవిస్తే ఆ స్వాతంత్ర్య హక్కును నిరాకరించడం వినా చేసేది లేదన్నారు. ఆల్జీరియాపట్ల తమ విధానాన్ని యదార్థదృష్టితో కొంతమంది పరిశీలించడం లేదనీ, మరికొంతమంది ఈ సమస్యా పరిష్కారానికి అద్భుతమైన మార్గాలకోసం వెదుకుతున్నారనీ ఆయన అన్నారు. ఆల్జీరియానుండి ఫ్రెంచి వారిని వెడలగొట్టమని విప్లవవాదులకు సలహా ఇచ్చేవారు, ఫ్రాన్సునుండి మూడున్నర లక్షల ఆల్జీరియనులను కూడా పంపించివేయమని చెప్పడమే అనీ విప్లవ నాయకులు కోరుతున్నట్లు ఫ్రాన్సులోని ఆల్జీరియనులు ప్రజలను విదేశస్థులుగా గురిస్తే ఇక వారికిక్కడ ఉద్యోగం లభ్యం కాదనీ ఇది ఆల్జీరియాకు అత్యంత క్లిష్టసమస్య కాగలదనీ అన్నారు.

# కొరడాల ప్రయోగానికి స్వస్తి

## బొంబాయి ప్రభుత్వ నిర్ణయం

బొంబాయి, జూలై 25: బొంబాయి రాష్ట్రంలో కొరడాదెబ్బల శిక్షను రద్దు చేస్తున్నారు. ఇందునిమిత్తం బొంబాయి ప్రభుత్వం 1947 సంవత్సరపు కొరడా ప్రయోగచట్టాన్ని రద్దుచేస్తూ ఒకశాసన ముసాయిదాను ప్రకటించింది. ఇప్పుడు బొంబాయి రాష్ట్రంలో చేరిపోయిన పూర్వపు సౌరాష్ట్రరాష్ట్రం కొరడా దెబ్బల శిక్షను రద్దుచేస్తూ ఇదివరకే శాసనంచేసింది.

# రష్యా సైనికాధిపతులకు తిమ్మయ్య విందు

మాస్కో, జూలై 26: సోవియట్ రక్షణ మంత్రికీ, సైనికాధిపతులకు యీనెల 24న భారత సర్వసైన్యాధ్యక్షుడు జనరల్ తిమ్మయ్య విందు చేశారని సోవియట్ వార్తాసంస్థ ప్రకటించింది. ఈ విందులో రష్యా రక్షణ మంత్రి మార్షల్ ఝుకోవ్, వైమానిక, నౌకా పదాతి దళాలధిపతులు పాల్గొన్నారు.

# చైనాపై సురావర్దీ హద్దు మీరిన విమర్శలు

హాంకాంగ్, జూలై 24: అమెరికా పర్యటనలో పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్దీ శ్రీ డలెస్‌కు సైదోడుగా చైనా ప్రభుత్వంపై సాగిస్తున్న నిందాప్రచారం మరీ హద్దు మీరిపోతున్నదని, "పీపుల్స్ డెయిలీ" (పెకింగ్) పత్రిక విమర్శించింది.

చైనాను శ్రీ సురావర్దీ విమర్శిస్తే చైనా పరువు పీసమైనా పోదు, కాని శ్రీ సురావర్దీ ప్రతిష్ఠమాత్రం పిసం పెరగదు, అని ఈ పత్రిక వ్యాఖ్యానించింది.

క్రిందటి అక్టోబరులో చైనా ప్రధాని శ్రీ చౌ కరాచీ దర్శించినప్పుడు, చైనాతో పాకిస్తాన్ మైత్రి, సహకారం, అంటూ శ్రీ సురావర్దీ చెప్పిన మాటలను వారే ఒకసారి సుస్మరణకు తెచ్చుకోవడం మంచిదని ఈ పత్రిక సూచించింది.

# ట్యునీషియా రాజు నిర్బంధం

## త్వరలో రాజరికం రద్దయే సూచన

ట్యూనిస్, జూలై 24: ట్యునీషియా బే (రాజు) రాజభవనంవద్ద చుట్టూ పోలీసు బలగాన్ని పెట్టి రాకపోకలను ప్రభుత్వం బంధించి వేసింది.

రాజబంధువులు, మిత్రుల నివాస భవనాల వద్ద కూడా ప్రభుత్వం పోలీసు బందోబస్తు ఏర్పాటు చేసింది.

ఒకటి రెండు రోజులలో ట్యునీషియాలో రాజరికం రద్దయిపోవచ్చు.

ట్యునీషియాకు ఫ్రెంచి పరిపాలన నుండి విముక్తి తెచ్చి స్వాతంత్ర్యం సంపాదించి పెట్టిన నియో దస్తూర్ పక్ష నాయకుడూ, ప్రస్తుత ప్రధానీ అయిన శ్రీ హబీబ్ బోర్గీబా, రేపు రాజ్యాంగ పరిషత్తు ప్రత్యేక సమావేశం జరుపుతున్నారు.

ట్యునీషియాకు రాజరికమే ఉండాలో, లేక ప్రజాసత్తాక రాజ్యవ్యవస్థ (రిపబ్లిక్) ఏర్పడాలో ఈ పరిషత్తు నిర్ణయిస్తుంది.

పరిషత్తు నిర్ణయానికి వచ్చే లోగానే 66 ఏళ్ళ బే (రాజ్యాధిపతి) సిదీలామీన్ సింహాసనం త్యజించవచ్చుకూడా. వీరి వంశం రెండున్నర శతాబ్దాలుగా రాజరికం సాగించింది.

ట్యునీషియాలో రాజరికాన్ని రద్దుపరిచి ప్రజాసత్తాక రాజ్యం నెలకొల్పాలని, అధికారపక్షమైన నియోదస్తూర్ పక్షం క్రిందటి సోమవారంనాడే నిర్ణయించుకున్నట్లు ఒక వార్త ప్రచారంలో ఉంది.

# అవామీలీగ్ నుంచి భషానీ రాజీనామా

## పాకిస్తాన్ పరదాస్యానికి లోబడుతోందని ఖేదం

ఢాకా, జూలై 24: తూర్పు పాకిస్తాన్ అవామీలీగ్ ప్రాథమిక సభ్యత్వానికి మౌలానా భషానీ ఇవాళ రాజీనామా ఇచ్చారు.

రాజీనామాకు గల కారణాలను వారు పార్టీ కార్యదర్శికి ఒక లేఖలో వివరిస్తూ కేంద్రంలోనూ, తూర్పు పాకిస్తాన్‌లోనూ అధికారం స్వీకరించినది మొదలు, అవామీలీగ్ నాయకులు, ముఖ్యంగా శ్రీ సురావర్దీ, లీగ్ ఎన్నికల నివేదికను, 21 అంశాల కార్యక్రమాన్నీ అతిక్రమించి వ్యవహరిస్తున్నారని భషానీ ఆరోపించారు.

విదేశాంగ విధానంలో అవామీలీగ్ ప్రాథమిక సూత్రాలనే అతిక్రమించి, దేశాన్ని క్రమంగా పరదాస్యానికి లోబరుస్తున్నారని వారు విమర్శించారు.

శ్రీ భషానీతోపాటు మరో ఇద్దరు నాయకులు కూడా అవామీలీగ్‌నుంచి ఇవాళ తప్పుకున్నారు.

# కరాచీ ప్రత్యేక ప్రతిపత్తికి ఆందోళన

కరాచీ, జూలై 24: కరాచీ నగరాన్ని పశ్చిమ పాకిస్తాన్ ప్రభుత్వ అధికారంలోనుంచి తొలగించి, ప్రత్యేక ప్రతిపత్తి ఇవ్వాలంటూ ఉద్యమం సాగించడానికి ఏర్పడిన ఒక సంఘం, నిన్న ఒక ఊరేగింపు జరపగా, పోలీసులు లాఠీ ప్రయోగం చేశారని ఒకరన్నారు.

1948 లో సింధు రాష్ట్రంనుంచి కరాచీని విడదీస్తూ గవర్నర్ జనరల్ జిన్నా గెజెట్ ప్రకటన చేసినప్పటికీ అది ఇంతవరకూ అమలు జరపలేదని, ఈ ఉద్యమకారులు అంటున్నారు.

కరాచీ నగర ప్రతిపత్తి విషయంలో కేంద్ర మిశ్రమ ప్రభుత్వానికి చెందిన అవామీలీగ్, రిపబ్లికన్ పక్షాల మధ్య అభిప్రాయభేదాలున్నాయి.

కరాచీ పురపాలక సంస్థ క్రిందటి నవంబరులో రద్దయినప్పటినుంచీ, నగరాన్ని కేంద్ర ప్రభుత్వమే స్వయంగా పరిపాలిస్తోంది.

# వలస ప్రాంతాల సమాచారం

## యూరోపు రాజ్యాలపై భారత ప్రతినిధి విమర్శ

ఐక్యరాజ్యసమితి, జూలై 24: కొన్ని యూరోపు రాజ్యాలు తమ పరిపాలన క్రింద ఉన్న వలసప్రాంతాలు "తమ దేశాలలో చేరిన భాగాలు" అని చెప్పుతూ, వాటిని గురించిన సమాచారం ఐక్యరాజ్యసమితికి అందజేయడం లేదని సమితిలోని భారత శాశ్వత ప్రతినిధి శ్రీ అర్థర్ లాల్ ఈ రోజున చెప్పారు. స్వపరిపాలనాధికారం లేని ప్రాంతాలకు సంబంధించిన సమాచారం సేకరించే సమితి అనుబంధసంఘ సమావేశంలో మాట్లాడుతూ, "కాలం గడచే కొలది ఈ కల్ల రాజ్యాంగం సమర్థించుకోవడం నిస్సందేహంగా దుస్తరం కాకమానదు" అని ఆయన అన్నారు.

ఆఫ్రికాలోను, ఇతర ఖండాలలోను ఉన్న స్వపరిపాలనాధికారం లేని ప్రాంతాల సాంఘిక ఆర్థిక వ్యవహారాలు గురించిన సమాచారం సేకరించడానికి ఈ సంఘం ఏర్పడినది. శ్రీ లాల్ పేరు పెట్టి ఏ ప్రాంతం గురించి మాట్లాడలేదు. అయితే ఆయన గోవాను ఉద్దేశించే ఆ విధంగా విమర్శించారనేది స్పష్టం. గోవా పోర్చుగల్‌లో చేరిన భాగమంటూ పోర్చుగల్ ప్రభుత్వం గోవా గురించిన సమాచారం అందచేయడానికి నిరాకరిస్తున్నది.

"ఆ ప్రాంతాలలోని ప్రజలక్షేమం అన్నిటికన్న ప్రధానమైనది. వారి అభివృద్ధికి పాటుపడడం 'పాలించే దేశాల పరమపవిత్రమైన ధర్మం' ఈ రెండు సూత్రాలకు లోబడి ఆ ప్రాంతాల పరిపాలన సాగాలని సమితి ప్రణాళిక ఆదేశిస్తున్నది" అని కూడా శ్రీ లాల్ చెప్పారు.

# స్వేచ్ఛకల దేశానికి వలస

## బ్రిటిష్ శాస్త్రజ్ఞునికి భారతదేశ నివాసం

లండన్, జూలై 24: "విదేశాల సైనికులకు స్థావరమివ్వని దేశంలో, స్వేచ్ఛకల దేశంలో నివసించాలని వాంఛ" అని ప్రసిద్ధ జీవశాస్త్రజ్ఞుడు, బ్రిటిష్ పౌరుడైన ప్రొఫెసర్ జె. బి. యస్. హాల్డేన్ ఇవాళ భార్యాసమేతంగా భారతదేశానికి ప్రయాణమై బయలుదేరుతూ అన్నారు. విదేశీ సైనికులంటే అమెరికన్లు అనే తమ భావం, అని శ్రీ హాల్డేన్ స్పష్టపరిచారు.

64 ఏళ్ల వయస్సుగల బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు శ్రీ హాల్డేన్ భార్యతో సహా భారతదేశంవచ్చి, కలకత్తాలో స్థిరనివాసం ఏర్పరచుకుంటారు.

శ్రీ హాల్డేన్ భారత గణాంకసంస్థలో పరిశోధక శాఖాధిపతిగానూ, వారి భార్య డా॥ హెలెన్ స్పర్వే అదే సంస్థలో అధ్యాపకురాలుగాను పని చేస్తారు.

బ్రిటన్ విడిచిపెట్టి వెయ్యాలనే తొందరపాటు, సూయజ్‌పై బ్రిటిష్ విమానాల దాడి జరిగిననాడే కలిగిందని శ్రీ హాల్డేన్ చెప్పారు.

సూయజ్ వ్యవహారాలవంటివి, పాత సంప్రదాయాలకు అలవడిన తమవంటివారికి నచ్చవన్నారు.

ఇప్పుడుకాదు, ఇదివరకే చాలరోజులుగా బ్రిటన్ విడిచి వెళ్లిపోవాలని వారికి కోరిక కలిగిందట.

అయితే ప్రత్యేకం అమెరికన్ సైనికులపట్ల తమకు స్పర్ధ ఏమీ లేదని వారు చెప్పారు. బ్రిటన్‌కువచ్చేది అమెరికన్లు అయినాసరే, జర్మన్లు, ఫ్రెంచివారు, మరొకరు ఎవరైనాసరే తమకు పరాయి సైన్యాలు రావడం ఇష్టంలేదన్నారు.

శ్రీ హాల్డేన్ ఇదివరలో లండన్ విశ్వవిద్యాలయ కళాశాలలో అధ్యాపకులుగా పనిచేశారు 1949 వరకూ బ్రిటిష్ కమ్యూనిస్టు దినపత్రిక "డెయిలీ వర్కర్" సంపాదకవర్గ అధ్యక్షులుగా పనిచేశారు.

భౌతిక శాస్త్రాలలో స్టాలినిస్టు ప్రమేయం వస్తున్నందుకు ఆక్షేపణగా, వారు క్రిందటేడు కమ్యూనిస్టుపార్టీ నుంచి తప్పుకున్నారు.

# నిరాయుధీకరణపై లండన్ చర్చలు

లండన్, జూలై 24: రాకెట్లు, క్షిపణాస్త్రాలను గురించిన అమెరికా ప్రతిపాదనలను రేపు తెలియపరచ గలరని, అమెరికా ప్రతినిధి శ్రీ హెరాల్డ్ స్టాసెన్ ఇవాళ సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో చెప్పారు.

ఇదిగాక, ఇంకా వైమానిక పరిశీలన గురించిన ప్రతిపాదనలను శ్రీ స్టాసెన్ వివరించవలసినవి ఉన్నాయి.

శ్రీ స్టాసెన్ అమెరికన్ ప్రతిపాదనలను ఒక్కొక్కటిగా వివరించడం మొదలుపెట్టి ఇప్పటికి రెండుమాసాలవుతోంది. ప్రతిపాదించవలసిన అంశాలు ఇంకా ఉన్నాయి.

ఇలా ఒక్కటొక్కటిగా ప్రతిపాదించడంలో అర్థం, మార్చి 18న ప్రారంభమైన నిరాయుధీకరణ చర్చలను తెంపులేకుండా సాగించాలని పశ్చిమ రాజ్యాలు పన్నుగడ వేశాయని రష్యా ఆరోపించింది.

ఈ ఉపసంఘం తన చర్చలపైన సమితి నిరాయుధీకరణ సంఘానికి (12 రాజ్యాల సంఘం, న్యూయార్కులో కార్యాలయం) ఆగస్టు 1వ తేదీకి నివేదిక అందించవలసి ఉంది.

# మెగాటన్ బాంబుల తయారీ

## బ్రిటిష్ రక్షణమంత్రి ప్రకటన

లండన్, జూలై 23: వైమానిక దళమూ, రాకెట్ దళమూ వినియోగించేందుకు వీలుగా మెగాటన్ బాంబులను తయారు చేయడానికి అవసరమైన సమాచారాన్ని సేకరించే అవకాశం పసిఫిక్ సముద్రంలో జరిపిన పరీక్షలవల్ల కలిగిందనీ, మెగాటన్ ఆయుధాలతో ఒక తడవ చేసిన ప్రయోగంవల్లనే ఇది సాధ్యమైందనీ పార్లమెంటులో ప్రతిపక్ష సభ్యుల విమర్శకు సమాధానం ఇస్తూ బ్రిటిషు రక్షణ మంత్రి డంకన్ శాండీస్ తెలిపారు. ఇకముందు జరిపే పరీక్షలవల్ల మారణాయుధాలు తయారు చేసే ప్రేలుడు పదార్థాల మొత్తాన్ని తగ్గించే వీలు కలుగుతుందనీ, ఇతర దేశాలన్నీ అంగీకరించనిదే అణ్వాయుధాల విసర్జనపై అంతర్జాతీయ పర్యవేక్షణకు తాము అంగీకరించేది లేదనీ ఆయన తెలిపారు. కార్మిక పక్షం ప్రతిపాదించిన కోత తీర్మానం అరవై ఓట్ల తేడాతో వీగిపోయింది.

# ఓమాన్ విషయమై అమెరికాలో అలజడి

## ఆశాసౌధాలు కూలుతాయేమోనని భయం

వాషింగ్టన్, జూలై 24: ఓమాన్‌మీద విమానదాడులు సాగించవద్దని బ్రిటన్‌ను అమెరికా కోరవంలేదని, సౌదీ అరేబియాకు కూడా కలుగజేసుకొనమని పంపలేదని అమెరికా విదేశాంగశాఖ ఉద్యోగులు నేడు తెలియజేశారు.

ఇప్పుడు ఓమాన్‌లో తిరుగుబాటుదార్లు అమెరికా ఆయుధాలను వాడుతున్న వార్తలు వస్తున్నాయి. ప్రభుత్వవర్గాలవారు ఈ వార్తలను ఖండిస్తున్నారు కాని, అభిజ్ఞులెవ్వరూ ఈ ఖండనలను నమ్మడంలేదు. సౌదీ అరేబియాకు అమెరికా ఇచ్చిన ఆయుధాలు ఎట్లాగో, ఇమాం అనుయాయుల చేతుల్లో పడ్డాయని అంటున్నారు.

ఈ ఓమాన్ తగాదాలోకి సౌదీ అరేబియా పేరును లాక్కురావడం అమెరికాకు ఎంతమాత్రం ఇష్టం లేదు. జరిగిన నవంబరుదగ్గరనుంచీ, అమెరికావారు సౌదీ అరేబియా రాజును, తమ పశ్చిమ ఆసియా విధానాలకు కీలకంగా చేసుకొని, వ్యవహారాన్ని నడిపిస్తున్నారు. ఇప్పుడు ఓమాన్‌లో ఈ తిరుగుబాటు వెనుక సావూద్ రాజు వున్నాడని ఎవరన్నా అన్నా, ఈ అధికారులు మహా కంటగించుకుంటున్నారు. సౌదీ అరేబియాకు ఇచ్చిన ఆయుధాలు, ఇమాం సైన్యాల చేతుల్లో కన్పించినంతమాత్రం చేత, ఈ తిరుగుబాటుతో సావూద్ రాజుకు సంబంధం వుందని అనడానికి లేదని ఈ అధికారవర్గాలవారు వాదిస్తున్నారు.

ఈ సర్వ వ్యవహారాన్ని వాషింగ్టన్ పోస్ట్ పత్రిక సంక్షిప్తంగా ఇట్లా వివరిస్తోంది: "ఈ ఓమాన్ తగాదాలో అమెరికాకు బాధ కల్గిస్తున్న విషయం ఇది. ఇది ముదిరేపక్షంలో, అమెరికా, అటు బ్రిటన్‌ను ఏమీ అనలేని, సౌదీ అరేబియాను ఏమీ అనలేని స్థితిలో పడిపోతుంది. అంతేగాక, ఈజిప్టునుంచి సావూద్ రాజును విడదీయడానికి, తన వైపుకు తిప్పుకోడానికి అమెరికా ఇన్ని నెలలుగా చేసిన కృషి అంతా వ్యర్థం అయిపోతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ ఓమాన్, మస్కాట్ తగాదాతో, మధ్య ప్రాచ్యంలో కట్టుకున్న ఆశా సౌధాలన్నీ ఒక్క దెబ్బతో కూలిపోతాయి."

కాగా సమితిలోని అరబ్ రాజ్యాల ప్రతినిధులు నేడు ఈ ఓమాన్ వ్యవహారాన్ని గూర్చి చర్చించారు. అయితే ఆసియా ఆఫ్రికా వర్గాన్ని సమావేశపరుద్దామనే అంతదాకా వ్యవహారం ఇంకా వెళ్ళలేదు. ఇతర రాజ్యాల ప్రతినిధులు గూడా ఈ వ్యవహారాన్ని గూర్చిన వార్తలను ఆసక్తితో పరిశీలిస్తున్నారు.

ఇంతవరకు సమితి కార్యదర్శికి ఈ వ్యవహారాన్ని గూర్చిన వార్తలేమీ అందలేదు.

# కేరళ హిందీ ప్రచార సమ్మేళనము

## రాష్ట్రపతిచే ఆగస్టు 12న ప్రారంభోత్సవం

తిరువేంద్రం, జూలై 25: రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్, కేరళ హిందీ సమ్మేళనాన్ని ఆగస్టు 12న ప్రారంభిస్తారని దక్షిణ భారత హిందీ ప్రచారసభ కేరళశాఖ ప్రకటించింది.

రాష్ట్రపతి ఆగస్టు 11న వచ్చి నాలుగు రోజులు యిక్కడ గడుపుతారు.

ఈ సమ్మేళనకు రాష్ట్ర గవర్నర్ డా॥ బూర్గుల రామకృష్ణరావు అధ్యక్షత వహిస్తారు.

# మదరాసు ధరలు

మదరాసు, జూలై 26:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 71.00
పేట్లాబంగారం తులం రు. 110.00
మూసా బంగారం తులం రు. 108.0-
సీమవెండి తులం 100 కి రెడీ 166.00
చిల్లర ధర రు. 1.90

వేరుశనగ

(కేండీ పౌ॥ 1-కి ఎక్సుగోస్తా గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా
డిసెంబరు రు. 166-172
వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ డిలో % పౌ.) రెడీ చిల్లర ధర 338
(ఎక్సుపెల్లర్‌కి రు. 26, సేల్సుటాక్సు, ఎక్సైజ్ సుంకంతో సహా)
50 పెంకాయనూనె (37½ పౌనులు సేల్సుటాక్సు అదనం,
అంబురాక్కు రు. 33.50
ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా 34.00
రాజా రు. 33.50

ఆముదం

తిరుపత్తూరు (500 పౌ.) రు. 355
సేలం లోటస్ క్యాన్ (37½ పౌ) 28.00

పంచదార

సామర్లకోట 108.06

# న్యూయార్కు దూది

## అక్టోబరు వాయిదా ధరలు

న్యూయార్కు, జూలై 25: న్యూయార్కు, కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి:

నేటి ప్రారంభ ధర 34.69
నేటి ముగింపు ధర 34.83

# రష్యాలో పదవీ మార్పులు

మాస్కో, జూలై 24: రష్యాలో మధ్యరకపు ఇంజనీరింగ్ పరిశ్రమల మంత్రిగా పనిచేస్తున్న శ్రీ మైఖేల్ పెర్వుకిన్‌ను, సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గంవారు ఆ పనిలోంచి తప్పించి విదేశీ ఆర్థిక సంబంధాలసంఘం అధ్యక్షునిగా నియమించారు.

టాస్ వార్తాసంస్థ నేడు ఈవార్తను బయటపెట్టింది. పశ్చిమ రాజ్యాలలో వారు, రష్యాలోని యీ మధ్యరకపు ఇంజనీరింగు పరిశ్రమలశాఖ అంటే, సోవియట్ అణుశక్తి సంఘం అని భావిస్తున్నారు. అందువల్ల శ్రీ పెర్వుకిన్‌ను పెద్దపనిలోంచితీసి, చిన్నపనిలో వేసినట్లు పశ్చిమ రాజ్యాలవారు భావిస్తున్నారు.

ఇప్పుడు శ్రీ పెర్వుకిన్ స్థానే యీ మధ్యరకపు ఇంజనీరింగ్ పరిశ్రమల మంత్రిగా శ్రీ యాఫిం స్లావ్‌స్కీని వేశారు.

జూలైలో జరిగిన మార్పులలో శ్రీ పెర్వుకిన్ ప్రథమ ఉపప్రధాని పదవిలోంచి తొలగించారు. పూర్వం ఈయన ఈ అధ్యక్షవర్గంలో సంపూర్ణ సభ్యుడుగా కూడా వుండేవారు. ఇప్పుడు పర్యాయసభ్యునిగా ఈయన్ను దింపివేశారు.

# రష్యా - జర్మని సంబంధాలపై చర్చలు

మాస్కో, జూలై 23: వాణిజ్యం, పౌరుల తరలింపు, కాన్సలేట్ కార్యాలయాల ఏర్పాటు మొదలగు విషయాలు తేల్చుకోవాలని పశ్చిమ జర్మనీ, రష్యా, ప్రతినిధులు నేడు నిశ్చయించారు. వీటికి సంబంధించిన చర్చలు త్వరలో ప్రారంభం కావాల్సివుందని టాస్ ప్రకటించింది.

సోవియట్ విదేశాంగ కార్యాలయంలో యీ సమాలోచనలు జరిగాయి. పౌరుల తరలింపు చాలా కష్టమైన సమస్యగా భావిస్తున్నారు.

# రష్యాతో పశ్చిమ జర్మనీ సమాలోచనలు

మాస్కో, జూలై 23: వ్యాపారం, రాయబార ప్రతినిధి కార్యాలయాల స్థాపన, జర్మన్ యుద్ధ ఖైదీల విడుదల సమస్యలపై రష్యా, పశ్చిమ జర్మనీ ప్రతినిధి వర్గాలమధ్య సమాలోచనలు, మళ్ళీ ఇవాళ సోవియట్ యూనియన్ విదేశాంగశాఖ కార్యాలయంలో ప్రారంభమైనాయి.

ఈసమాలోచనలలో, జర్మన్ యుద్ధ ఖైదీల సమస్య అతి క్లిష్టమైనది. రెండో ప్రపంచ యుద్ధంలో రష్యన్లకు చిక్కిన జర్మన్ ఖైదీలు ఇంకా అనేక వేలమంది రష్యా అధీనంలోనే ఉన్నారని పశ్చిమ జర్మనీ అంటున్నది. కాని ఖైదీలు అట్టేమంది లేనేలేరనీ, ఉన్నారని చెపుతున్న వారిలో చాలమంది సోవియట్ యూనియన్ పౌరులేననీ, రష్యా వాదిస్తున్నది.

# క్రీడారంగం

## చిత్తూరుజిల్లాపాఠశాలల్లో ఆటలపోటీలు

తిరుపతి, జూలై 22: చిత్తూరు జిల్లా సెకండరీ పాఠశాలల క్రీడా సంఘ సమావేశం శ్రీ ఆర్. యం. రెడ్డి అధ్యక్షతన జరిగింది. శ్రీ వి. యస్. వెంకటనారాయణ కార్యదర్శిగా, శ్రీ పి. సుందరం క్రీడావిభాగ కార్యదర్శిగా ఎన్నికైనారు.

శ్రీ టి. సుబ్బరామయ్య పాఠశాలలలో అందరు ఆటలలో పాల్గొనే పద్ధతి ప్రవేశపెట్టాలని చెప్పారు.

జిల్లాను నాలుగు క్రీడా మండలాలుగా విభజించి పోటీల నిర్వహణకు పుత్తూరు, చిత్తూరు, మదనపల్లి, తిరుపతి, లను నిర్ణయించారు. శ్రీ యం. బార్నబస్ వందన మర్పించారు.

(స్వ. వి.)

## ఖర్గపూర్‌లో రైల్వే ఫుట్‌బాల్ పోటీలు

ఖర్గపురం, జూలై 20: ఆగస్టు 17 నుంచి ప్రారంభంకానున్న ఫుట్‌బాల్ టోర్నమెంట్లకు వివిధ రైల్వే జట్లను పంపుతున్నాయి. 13 జట్లు పాల్గొంటాయి. ఆగ్నేయ రైల్వే క్రీడా సంఘం యీపోటీలు నిర్వహిస్తున్నది.

# ఆంధ్ర విశ్వవిద్యాలయం

## సర్టిఫికెట్ కోర్సు ఫైనల్ పరీక్షా ఫలితాలు

వాల్తేరు, జూలై 25: ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆధ్వర్యాన ఈ సంవత్సరం (1957) మార్చి - ఏప్రిల్ - జూన్ మాసాలలో జరిగిన దిగువ పరీక్షలలో ఆ యా నెంబర్ల విద్యార్థులు కృతార్థులయ్యారని రిజిస్ట్రార్ ప్రకటించారు.

### సర్టిఫికెట్ కోర్సు ఫైనల్ పరీక్ష

ఇంగ్లీషు

డిస్టింక్షన్‌తో ఉత్తీర్ణులయినవారు: 4 6 10 11 17 20 33 34 49 58 61 66.

మామూలుగా ఉత్తీర్ణులయినవారు: 1 2 3 5 7 8 9 12 13 14 15 16 18 19 21 22 23 24 25 26 27 28 29 30 31 32 35 36 37 38 39 40 41 42 43 44 45 46 47 48 50 51 52 53 54 55 56 57 59 60 62 63 64 65.

తెలుగు

డిస్టింక్షన్‌తో ఉత్తీర్ణులయినవారు: 68 69 100 117.

మామూలుగా ఉత్తీర్ణులయినవారు: 67 70 71 72 73 75 76 77 78 79 80 81 82 83 84 85 86 87 88 89 90 91 92 93 94 95 96 98 99 101 102 103 104 105 106 107 108 109 110 111 112 113 114 115 116 118 119 120 121 122 123 124 125 126 127.

ప్రకృతి శాస్త్రం

డిస్టింక్షన్‌తో ఉత్తీర్ణులయినవారు: 129 132 133 135 136 138 139 141 142 143 144.

మామూలుగా ఉత్తీర్ణులయినవారు: 128 130 131 134 137 140 145 146.

సాంఘికశాస్త్రం

డిస్టింక్షన్‌తో ఉత్తీర్ణులయినవారు: 158 164 169 174.

మామూలుగా ఉత్తీర్ణులయినవారు: 147 148 149 150 151 152 153 154 155 156 157 159 160 161 162 163 165 166 167 168 170 171 172 173 175 176 177 178.

పై నెంబర్ల విద్యార్థులలో ఇతర విశ్వవిద్యాలయాల నుంచి వచ్చినవారు "మైగ్రేషన్ సర్టిఫికేట్లు" రిజిస్ట్రారుకు అందజేయాలి.

ఎం. ఎస్. సి. డిగ్రీపరీక్ష - అప్లైడ్ ఫిజిక్సు (ఫైనల్) (పాత నిబంధనలు)
ప్రథమశ్రేణి: ఎవ్వరూ లేరు.
ద్వితీయశ్రేణి: 773 మాత్రమే.

# వర్షాల్లో గోడకూలి అయిదుగురి మృతి

నైజాపూర్, జూలై 25: వర్షాల మూలంగా యీ ఉదయం ఒక గోడ కూలి ప్రక్కనే ఉన్న గుడిసెమీద పడటంవల్ల అయిదుగురు మరణించారు.

ఈ కుటుంబంలో మిగిలినవారి సహాయార్థం కలెక్టరు రు. 500 మంజూరు చేశారు.

# భారత ప్రభుత్వము

## 3¾% నేషనల్‌ప్లాన్ బాండ్లు - 1967

నాల్గవ క్రమము (3¾% - 1967)
విడుదల విలువ రు. 100 టికి రు. 99.50 (నామినల్)
1967 ఆగస్టు 1 వ తేదీన చెల్లింపబడును.

## 4% ఋణము - 1972

విడుదల విలువ రు. 100 టికి రు. 100 (నామినల్)
1972 ఆగస్టు 1 వ తేదీన చెల్లింపబడును.

పై బాండ్లకున్నూ, ఋణముకున్నూ సుమారు రు. 100 కోట్ల రూపాయల మొత్తము వరకు ఒకేదఫా చందాలు అంగీకరింపబడును. (1) రొఖము గాని చెక్కుగాని లేక (ii) 1957 సం॥ 3% విక్టరీ ఋణం సెక్యూరిటీలు లేక 1958 సం॥ 3% ఋణం - క్రింద వివరించిన విధముగా మారకమునకు అంగీకరింపబడును.

3% విక్టరీ ఋణము, 1957 ... రు. 100 టికి 100 (నామినల్)
3% ఋణము 1958 ... రు. 99.70 కి రు. 100 (నామినల్)

మారకమునకు అంగీకరించు 1957 సం॥ 3% విక్టరీ ఋణమునకున్నూ, 1958 సం॥ 3% ఋణమునకున్నూ 31-7-57 తేదీ వరకు ఆ తేదీతో చేరి వడ్డీ చెల్లించబడును.

క్రొత్త బాండ్లు, ఋణము 1957 ఆగస్టు 1 వ తేదీ నుండి వడ్డీ పొందగలవు. ఈ వడ్డీ ఆరునెలలకొకమారు ప్రతి ఫిబ్రవరి 1 వ తేదీన, ఆగస్టు 1 వ తేదీన చెల్లించబడును.

చందాలు వసూలు 5-8-1957 న ప్రారంభమై 8-8-1957 న లేక అంతకు ముందుగాగాని నోటీసుతో నిమిత్తం లేకుండా ముగించబడును.

బాండులకు, ఋణముకు దరఖాస్తు అంగీకరించు ఆఫీసులు:

(1) బెంగుళూరు, బొంబాయి, కలకత్తా, మద్రాసు, నాగపూరు, న్యూఢిల్లీ యందలి రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా ఆఫీసులు.

(2) క్రింద 3, 4 అయిటములతో తెలిపిన ప్రదేశములలో తప్ప ఇండియాలోని ఇతర స్థలములలోనున్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచీలు.

(3) ప్రభుత్వ కార్యక్రమములు చేయు స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు బ్రాంచీలు.

(4) మైసూరుస్టేటు యందలి బ్యాంక్ ఆఫ్ మైసూరు లిమిటెడ్ బ్రాంచీలు.

పూర్తి వివరములకు పై ఆఫీసులకుగాని లేక వాని బ్రాంచీలకుగాని లేక ప్రభుత్వ ఖజానాలకుగాని వ్రాసి తెలిసికొన గోరడమైనది.

